సెప్టెంబరు నెల

6 వ తేదినుండి



నరసు

స్టూడియోస్

# భలే అమ్మాయిలు

డైరెక్షన్: వేదాంతం రాఘవయ్య

సంగీతం: రాజేశ్వరరావు



సంవత్సర చందా
రు. 18—0—0
విడిపత్రిక 25 న.పై



# ఆంధ్రపత్రిక

సచిత్ర వారపత్రిక
Founder: K. NAGESWARA RAO

సంపుటము 52
సంచిక 2
4-9-57

హేవిళంబి భాద్రపదం, శుద్ధ ఏకాదశి, బుధవారం

## విషయానుక్రమణిక

ముఖచిత్రం:
పొన్నలూరి బ్రదర్స్‌వారి
'శోభ' లో
రాజసులోచన

# స్వతంత్ర మలయా

మూడు దశాబ్దాలపాటు "స్వరాజ్యం" అనేమాట భారతదేశంలో నాలుగు మూలలా ఎలా మారు మ్రోగిపోయిందో, అలాగే ఒక దశాబ్దం నుంచీ మలయాలో "మర్దేకా" అనేమాట ప్రతినోటా తాండవిస్తోంది భారతదేశానికి స్వరాజ్యం సిద్ధించిన సరిగ్గా దశాబ్దానికి మలయాకు "మర్దేకా" సిద్ధిస్తోంది

"మర్దేకా" అంటే స్వాతంత్ర్యమని అర్థం భారత స్వాతంత్ర్యం ఆసియా ఆఫ్రికా ఖండాలలోని బానిస దేశాలన్నిటినీ ఎలా ఉద్బుద్ధం చేసిందో మలయాను కూడా అలాగే ఉద్బుద్ధం చేసింది పొరుగున ఉన్న భారతదేశం స్వతంత్రం కావడంతో మలయాకూడా జాగరితమైంది ఈ జాగృతి ఫలితంగా మలయా ఆగస్టు 31 వ స్వతంత్ర దేశంగా అవతరిస్తోంది

ఆగస్టు నెలకూ ఆసియా దేశాల స్వాతంత్ర్యానికీ ఏదో చిత్రమైన సంబంధం ఉన్నట్లనిపిస్తుంది ఆగస్టు 14 న పాకిస్తాన్, 15 న భారతదేశం, 17 న ఇండొనేషియా, 31 న మలయా స్వాతంత్ర్యం పొందాయి మలయన్ స్వాతంత్ర్యంతో ఇక ఆసియాలో బ్రిటన్‌కు మిగిలినవల్లా చిన్నచిన్న వలసలే కాని పెద్దవేవీ లేవనే చెప్పచ్చు

స్వాతంత్ర్య సిద్ధితో మలయా కామన్వెల్తులో పదవసభ్యదేశమూ, అయిదవ శ్వేతేతర దేశమూ, అవుతున్నది ఈ కారణం చేతనే కాక, మలయన్ స్వాతంత్ర్యం భారతదేశానికి ఇంకా ఎన్నో విధాల ఆనందదాయకమవుతున్నది

## బ్రిటిష్ అధికారవ్యాప్తి

భారతదేశానికీ మలయాకు సంబంధం ఈ నాటిదికాదు దాదాపు రెండువేల ఏళ్ళుగా ఈ రెండుదేశాలకూ సాన్నిహిత్యం ప్రవర్తిల్లుతున్నది అతి ప్రాచీన కాలంలోనే భారతనౌకలు మలయన్ తీరాలకు ప్రయాణంచేసి వాణిజ్యం కొనసాగించినట్లు చరిత్ర తెలుపుతోంది హిందూమతం, నాగరికత, కళలు మలయాకు విస్తరించినట్లు కూడా చరిత్ర తెలుపుతోంది ఆ తరవాత బౌద్ధమతం, ఇస్లాం మతాలు కూడా మలయాకు వ్యాపించాయి ఈ దేశానికి మొట్టమొదటగా వచ్చిన యూరపియనులు పోర్చుగీసువారు (1511) తరవాత 1641 లో డచ్చివారు వచ్చారు ఆఖరున బ్రిటిషువారు వచ్చారు 1786 లో పెనాంగ్ ద్వీపాన్ని వీరు కౌలుకు తీసుకోవడంతో ఆ ప్రాంతంలో వీరి అధికారానికి ప్రాతిపదిక ఏర్పడింది ఆరోజుల్లో మలయా దేశమంతా చిన్న చిన్న స్వతంత్ర సంస్థానాలుగా విడిపోయి ఉండేది సంస్థానాధిపతులు తమలో తాము విడతెగకుండా కలహించుకునేవారు ఈ అంతఃకలహాల కారణంగానే బ్రిటిష్‌వారికి మలయాలో స్థావరాలు చేజిక్కడం జరిగింది కెడా రాజ్యపు సుల్తాను శత్రువులనుంచి తన్ను రక్షించవలసిందని బ్రిటిష్‌వారిని వేడుకుని పెనాంగ్ ద్వీపం వారికి కౌలుకు ఇచ్చేట్లుగా ఒడంబడిక చేసుకున్నాడు అప్పటి ఈస్టిండియా కంపెనీకి ఈ స్థావరం వర్తక



మలయా ఫెడరేషన్ అధ్యక్షుడుగా ఎన్నికైన టువంకూ అబ్దుల్ రహమాన్ (నెగ్రీసెంబిలాన్ సంస్థానపు సుల్తాను), ముఖ్యమంత్రి టెంకూ అబ్దుల్ రహమాన్, బ్రిటిష్ హైకమీషనర్ సర్ డొనాల్డ్ మెక్‌గిలివ్‌రే

# ★ స్వతంత్ర మలయా ★

కేంద్రంగా చాలా ఉపయోగించింది.

ఆతరవాత కొంతకాలానికి అనగా 1824వ సంవత్సరంలో ఈస్టిండియాకంపెనీ అధికారి సర్ స్టాంఫర్డ్ రాఫిల్స్ జొహోర్ సంస్థానపు సుల్తానుతో ఒడంబడిక చేసుకుని సింగపూర్ ద్వీపాన్ని స్వాధీనం చేసుకున్నాడు. ఆ కాలంలో ఈద్వీపం కేవలం చిత్తడి నేల. జననివాసానికి అనుకూలంగా ఉండేదికాదు. కాని ఆద్వీపానికి ఎప్పటికైనా మంచి ఉపయోగం రాగలదనే ఉద్దేశ్యంతో దాన్ని బ్రిటిష్‌వారు వశపరచుకున్నారు. ఆవిడాదే డచ్చి ఈస్టిండియాకంపెనీకి, బ్రిటిష్ ఈస్టిండియాకంపెనీకి జరిగిన ఒప్పందం ఫలితంగా బ్రిటిష్‌వారికి మలక్కా స్థావరాన్ని డచ్చివారు అప్పగించివేశారు. 1829 నాటికి బ్రిటిష్‌వారికి స్వాధీనమైన పెనాంగ్, సింగపూర్, మలక్కా ప్రాంతాలను కలిపివేసి, "స్ట్రెయిట్స్ సెటిల్ మెంట్స్" అనే పేరుతో బ్రిటిష్ ఈస్టిండియాకంపెనీ పరిపాలించసాగింది. ఈకంపెనీ భారతస్వాతంత్ర్య ప్రథమసంగ్రామం ఫలితంగా రద్దుచేయబడినప్పుడు, 1867 నుంచీ బ్రిటిష్ ప్రభుత్వమే ఈసెటిల్ మెంట్స్‌ను పరిపాలించసాగింది.

1874—1895 సంవత్సరాల మధ్యకాలంలో పెరాక్, సెలంగర్, నెగ్రిసెంబిలాన్, పహాంగ్ సంస్థానాల అధిపతులు బ్రిటిష్‌వారితో చేసుకున్న అనేక ఒప్పందాలఫలితంగా వారికిలోబడి పరిపాలించడానికి అంగీకరించారు. ఈనాలుగు సంస్థానాలూకలిసి ఒక ఫెడరేషనుగా ఏర్పడ్డాయి. వీటివ్యవహారాలు చూసేందుకు ఒకబ్రిటిష్ రెసిడెంట్ జనరల్ ఉండేవాడు.

ఇదేవిధంగా 1885—1914 సంవత్సరాల మధ్యకాలంలో జొహోర్, కెలంటన్, ట్రెంగానూ, పెర్లిస్, కెడా సంస్థానాలు కూడా బ్రిటిష్ అధిపత్యానికి లోబడడానికి అంగీకరించాయి. అయితే ఈ అయిదు సంస్థానాలు ఫెడరేషనులో చేరడానికి ఇష్టపడక, విడిగానే ఉండిపోయాయి. ఈ విధంగా మొత్తం మలయా దేశం యావత్తూ బ్రిటిష్ వారి సర్వాధిపత్యానికి లోబడిపోయింది.

## స్వాతంత్ర్యంకోసం ఒత్తిడి

రెండవ ప్రపంచ యుద్ధకాలంలో మలయా జపాను కైవసమైంది. మొదట్లో కొంతకాలం ప్రతిఘటన జరగలేదు గాని క్రమక్రమంగా మలయనలో చాలా మంది జపాన్ అధికారాన్ని తీవ్రంగా ప్రతిఘటించసాగారు. 1945 ఆగస్టులో జపాను లొంగిపోయిన తరవాత బ్రిటిష్ వారు మలయాను తిరిగి ఆక్రమించి వచ్చేటికీ మలయన్ జాతీయోద్యమం అంతరించలేదు. క్రమంగా అనేక రాజకీయ పక్షాలు ఏర్పడి బ్రిటిష్ వారిని ఒత్తిడి చేయసాగాయి.

1946 లో బ్రిటిష్ వారు సింగపూరును మాత్రం విడిగా ఉంచి మిగతా మలయన్ సంస్థానాలన్నిటినీ ఏకం చేసి ఒకే యూని




యన్‌గా ఏర్పరచారు. కాని ఈ ఏర్పాటును మలయన్లు తీవ్రంగా ప్రతిఘటించారు. అందుచేత యూనియన్‌ను రద్దుచేసి 1948 ఫిబ్రవరిలో బ్రిటిష్ వారు కొత్త రాజ్యాంగాన్ని ప్రకటించారు. ఈ రాజ్యాంగం ప్రకారం సింగపూరు మినహాగా, మిగతా 9 సంస్థానాలు, మలక్కా, పెనాంగ్ స్థావరాలు ఫెడరేషనుగా ఏర్పడ్డాయి. సంస్థానాలకు సుల్తానులనే అధిపతులుగా ఉంచారు. ఈ ఫెడరేషన్‌కు 98 మంది సభ్యులతో ఒక శాసనసభ, ఒక బాధ్యతాయుత మంత్రివర్గమూ ఏర్పడ్డాయి. ఈ విధంగా మలయాలో స్వపరిపాలనకు పునాదులు ఏర్పడ్డాయి. 1955 జూలైలో జరిగిన ఎన్నికలలో టెంకూ అబ్దుల్ రహమాన్ పక్షం

(56-వ పేజీ చూడండి)



# కాళీ హైమవతి.. శివరాత్రి నయని..

“కాకులు కుయ్యకుండానే లేస్తారను కుంటాను వీళ్లు; అసలు నిద్రనేది ఎలా ఉంటుందో ఎరుగుదురో అని? ఇంతకూ మిమ్మల్నెరిగినవాళ్ళందరికీ యిల్లూ, పెళ్ళాం, పిల్లలూ అ సెవి ఏమన్నా ఉన్నాయా? ఆగమ్మ కోడిల్లా శీఘులమ్మంట తిరగడమేనా? ఉద్యోగాలు కూడా లేవేమిటి వీళ్ళకు? ఇంకో ఉద్యోగంకూడా యెందుకూ? తిరగటానికే తీరిక లేకపోతూంటే... ఇలాటి వాళ్ళకు ఉద్యోగాలుకూడా యిస్తే యింక చెప్పుకోనక్కరేదు!

“లేకపోతే ఏవిటిదీ? తెల్లారిందో లేసే లేదో అప్పుడే సిద్ధం. వీళ్ళ తాతగారి ఆస్తి యేదో ఇక్కడ దాచబెట్టినట్టూ, అదెవ్వళ్లో దోచుకుపోతున్నట్టూను! ఇంతకూ మంచాలు ఎత్తారా? లేదా?

మీ కిదే చెప్పటం... ఈ వేళ భగవంతుడొచ్చినా సరే మీరు కదలటానికి వీల్లేదు! వాళ్ళకు పనీ, పాటా, యిల్లూ, పెళ్ళాం లేకపోతే యేం ‘బాబా’ వెనకాలో బాకా పట్టమనండి. పళ్ళూ, ప్రసాదాలూ దొరుకుతయి. అంతేకాని, నిక్షేపంలా కాపరం చేసుకొనే ఇళ్ళకొచ్చి, కట్టుకున్న వాళ్ళ కళ్ళనీళ్లు పెట్టించి, మిమ్మల్ని ఊరువెంబడి గంగిరెద్దులా తిప్పితే మాత్రం నే నూరుకోను సుమండీ!

“ఆదివారం వస్తుంది గదా, హాయిగా పిచ్చాపాటీ మాట్లాడుకుంటూ నాలుగూ చేసుకుని నవ్వుతూ తిందామనుకుంటే కొబ్బూరీ వాళ్ళల్లా సిద్ధం వీళ్ళు!

“అంటే అన్నా నంటారు గానీ, ఈ ఇంట్లో బిక్కు బిక్కుమంటూ ఒక్క ప్రాణినీ యెలా ఉండగలను చెప్పండీ? ఆఫీసున్న రోజులే నయం! సాయంకాలమయినా కాస్త తొందరగా ఇంటికొచ్చేవారు. ఈ ఆదివారం మరీ అధ్వాన్నం అయిపోతోంది!

“ఒక్క ఘడీ అయినా ఇంట్లో కూర్చుని కులాసాగా మాట్లాడుకోకపోతే, ఇంక పెళ్ళెందుకూ? మిమ్మల్నని ఏం లాభంలెండి... నా ఖర్మకాలి ఇలా అయింది. చదువుకున్నవారూ, ఉద్యోగం చేస్తున్నవారూ అయితే అచ్చటా—ముచ్చటా, ముద్దూ — మురిపెమూ తీరతాయని ఉబలాటపడ్డందుకు నాకుతగ్గశాస్తే జరిగింది! దాసీదానికి అంట్లు పడేశారా?

“చెప్పినట్టూ వినే మొగుడు ఉత్తినే దొరుకుతాడా! ఎవరో మా మేనత్తలాంటి దానికి, ఏ జన్మలో నోచిన ఫలం వల్లనో లభిస్తాడు! అందరి మొహాన్నా ఆ గీత ఉండొద్దూ... కాస్తంత మునిగిపోయిందేం లేదు, అలా కళ్ళప్పగించి వింటూ నిలబడకపోతే, కుంపటి విసరరాదూ? పిడు చంకదిగటం లేదుకదా! వీడుమాత్రం మీ కొడుకు కాడేమిటీ? వెధవ పెంకితనం వీడూనూ...అబ్బబ్బ! ఏం పీకుతావురా! నాలుగూ వేసుకు తింటే గదా ఒంట్లో రక్తం పట్టడానికి... అదే లేందే పాలెక్కడుంటాయి! మా ఇంటి దగ్గరున్నప్పుడు ఎంత యిదిగా ఉండేవాడు! దిష్టి తగులుందేమోనని రోజూ భయపడుతూనే ఉండే దాన్ని! ఇక్కడి కొచ్చాక నక్కలా తయారయాడు! డబ్బాపాలు కూడా పొయ్యలేమో, యింక! నా బాబు ఎలా అయి

ఉపశ్రీ పురాణపండ

పొయ్యాడో! ఈ వెధవఊళ్ళో శుభ్రమయిన పెరుగూ, నెయ్యీ కూడా దొరకవు. మళ్ళీ చూస్తే కమ్మటూరుకూడాను! అంతా తెలుకు మీరిపోయింది!

“అక్కడికీ అత్తయ్య శతవిధాలా చెప్పింది. చెప్తేనేం... నా ఖర్మ ఇలా ఉంటే ఎవడు మాత్రం తప్పించగలడూ... ఆవిడ చెప్పినట్టు విని అక్కడే ఇంకో రెండు నెలలుంటే తెలిసేది అయ్యగారి పని! మీరేం బాధపడుతూంటారో అని ఊరికే ఇదయిపోయి మూడో నెలన్నా వెళ్ళకుండా వచ్చాను. అయినా నాకు మీ మీదఉన్న ఇది మీకు నామీద యేడిసిందా యేమిటీ? నా కంఠశోష తప్ప. అయినకొడికి మూడు వేలూ పుచ్చుకుని, లాంఛనాలూ సాగించుకుని ఒక్క నగన్నా నా మెడలో తగలేశారా! ఒక్కగొలుసు... ఈ గొలుసుకూడా నగేనా! మాఇంట్లో దాసీదానికూతురుకుంది ... వాళ్లు నయం, ఏటా ఏదో ఓటి చేయించుకుంటారు. నా బతుక్కి ఆ భాగ్యం కూడానా? అక్కడికీ నేనేం వాటికోసం ఏడవటమే లేదు. నాలో నేనే కుళ్లుతున్నాను! ఎప్పటి కన్నా చేయించకపోతారా అని. ఆ ఆశే ఆశే. ఎండమావుల్లో నీరు దొరుకుతుందా? చేసుకున్నమ్మకి చేసుకున్నంతా! అక్కడికీ మా నాన్నతో చెప్పి సంక్రాంతికి రిస్టువాచీ పెట్టించాను. ఎలా అయితే నేం ఓ చీరగుడ్డ తెచ్చారు, నా మొహాన కప్పటానికి. వాకిళ్లానికి పారేద్దాం అనుకున్నాను... మీరేమన్నా బాధపడతారేమో అని ఊరుకున్నాను. అలా వింటూ కూర్చుంటారంతే ... బెల్లం కొట్టిన రాయిలా! ఆ కుంపటిమీద పాలు పొంగుతున్నట్టున్నాయి; కిందికి దింపి ఆ గిన్నెలో డికాక్షనుంది కలిపి నాకో గ్లాసెడు తగలేయండి. ముందు పాలగిన్ని దింపి, ఆ డబ్బాలోని రెండు కుప్పెళ్ళ కందిపప్పు చిన్న పప్పుగిన్నెలో పోసి, కుంపటిమీద తగలేయండి. వినిపిస్తోందా? అసలు నా మాటంటే లక్ష్యమా? ఏవన్నానా?, ఇరుగూ, పొరుగూ వింటే ఏవన్నా అనుకుని పోతారనన్నా లేదు. చూడండీ వాళ్ల సరోజిని మొగుడు వంటంతా చేసిపెట్టి, ఆఫీసుపని చూసుకుంటాడు. నా బతుక్కి అంతయోగం కూడానా! మళ్లీ ఆవిడ కాపరానికొచ్చి ఎనిమిది మాసాలయిందో, లేదో...జీడిమామిడి పిందెల నెక్లెస్సూ, గాజులజతా చేయించుకుంది. అవిట్టి చూట్టానికి నా మొహం చిక్కచచ్చిపోతోంది! ఆఖరికి ఈ నల్లపూసలకయినా బంగారం చుట్టించుకోలేక పోతున్నాను.

“శుభ్రమయిన రిబ్బనుముక్క కొనుక్కుందామంటే అణా డబ్బులుండవు చేతులో. వాళ్ళ రామలక్ష్మిని చూడండి...ఏ కొత్త సినిమా వచ్చినా, మొగుడుతో హాయిగా సైకిల్ రిక్షామీద పోతుంది. చిలకా-గోరింకల్లా అలా ఉండాలి మొగుడూ పెళ్ళాలంటే!”

“ఈ కాఫీ ఇలా తగలడిందేమిటీ? కొత్త పంచదార ఇలా పొయ్యండి. కొంచెం చల్లారబోసి ఇస్తే, మీ కొంపేం మునిగిపోయిందనీ! అదిగో ఆఫీసు బంట్రోతొచ్చి నట్టున్నాడు. ఇంట్లో లేరని చెప్తాను. మీరు మాట్లాడకండి.”






# వ్యయకర్తన సంఘాల తీ[illegible]

శ్రీకృష్ణ
[ఆంధ్రపత్రిక ప్రతినిధి]

కేంద్రప్రభుత్వోద్యోగుల వేతన పరిశీలక సంఘాన్ని ఇటీవల నియమించారు. ఈ సంఘ సభ్యుల పేర్లను, ఈ సంఘం పరిశీలించబోయే అంశాలను ప్రకటించారు.

భారతదేశంలో ప్రజాస్వామ్యం స్వతస్సిద్ధంగా అంకురించి వృద్ధిఅయినది కాదనేది స్పష్టమైంది. బ్రిటిష్ పార్లమెంటరీ ప్రభుత్వ విధానాన్ని ఈ దేశప్రజలమీద రుద్దారు గాని, ఇక్కడి ప్రజాజీవితంలోంచి అది ఉద్భవించలేదు.

అసలు సమస్యఅంతా ఇక్కడేఉంది. న్యూఢిలీలోని ప్రభుత్వోద్యోగులు పరదేశ పరిపాలకులకోసం కష్టించి పనిచేసినంతగా, తమప్రజలకోసం, తమదేశంకోసం పనిచేయడంలేదనేది నిర్వివాదాంశం. ఇది తలుచుకుంటే చాలాబాధగా ఉంటుంది. ఇన్సూరెన్సు ఉద్యోగులు ఇంగుకొక ఉదాహరణ. జీవితభీమాను జాతీయంచేయక ముందు కొద్ది జీతాలతోనే వారు పనిచేసినంతగా ఇప్పుడు చేయడంలేదు. ఇప్పుడు జరుగుతున్న జీవిత భీమా వ్యాపారపు లెక్కలు పరిశీలిస్తే ఇది స్పష్టపడుతుంది.

కేంద్ర ఉద్యోగుల వేతన పరిశీలక సంఘాన్ని నియమించారు, బాగానేఉంది. మరో సంఘాన్నికూడా నియమిస్తే ఇంకా బాగుంటేది. ఉద్యోగులను తగ్గించడంద్వారా ఖర్చుతగ్గించే మార్గాలను సూచించడంకోసం ఒక సంఘాన్ని వెయ్యవలసింది. కేంద్ర సచివాలయంలో ఉద్యోగులసంఖ్య అనవసరంగా పెరిగిపోతోంది. జీతాలు ఒక మోస్తరుగా ఉన్నంతకాలమూ ఎందరు ఉద్యోగులను కొత్తగా నియమించినా అంతబాధలేదు. అసలు అయిదేళ్ళక్రితం ఉద్యోగులను రిట్రెంచ్ చేయదలచినప్పుడే కేంద్రోద్యోగులు తమ జీతాలన్[illegible]ను తగ్గించుకోవడానికి సిద్ధపడ్డారు. అలాగే ఇప్పుడుకూడా జీతాలు హెచ్చించవలసివస్తే ఉద్యోగులను తగ్గించడం, ముఖ్యంగా తాత్కాలిక సిబ్బందిని తగ్గించడం అవసరం.

* * *

కేంద్రప్రభుత్వంలోని ప్రతిశాఖలోనూ వ్యయకర్తన సంఘాలను ఏర్పాటుచేశారు. ఉన్న సంఘాలు చాలక ఇవికూడా దేనికో తెలియడంలేదు. కొన్ని కొన్ని ఉద్యోగాలను భర్తీచేయకుండా కొంతకాలం వాయిదా వేసినంతమాత్రాన సమస్య పరిష్కారమైపోదు. ఏదో దృఢమైన చర్యతీసుకోవాలిగాని ఇలా వాయిదా వేసినంతలో ఒరిగేదేమీ లేదు.

1939 లో న్యూఢిల్లీలో ఆఫీసు భవనాల విస్తీర్ణం 6 48 లక్షలచ. అడుగులుంది. 1945 లో 27. 73 లక్షల చ. అడుగుల విస్తీర్ణం కావలసి ఉండగా 22 11 లక్షల చ. అడుగులు మాత్రమే లభ్యమైంది. 1946 అక్టోబరు నాటికి 26. 61 లక్షలు కావలసి ఉండగా 26.23 లక్షల చ. అడుగులు సిద్ధంగా ఉన్నది. 1946 సెప్టెంబరు 2 వ తేదీన ఐక్య భారత ప్రభుత్వాన్ని కాంగ్రెసు స్వీకరించిన తరువాత ఆఫీసు భవనాలకు కావలసినంత స్థలమూ దాదాపు సమకూరిందనే చెప్పవచ్చు. అప్పటికి భారతదేశం ఇంకా విభక్తం కాలేదుగనుకా, యుద్ధకాలపు ఒత్తిడివల్లా అంత భవనాల స్థలం అవసరమైందనేది గుర్తుంచుకోవాలి. అంటే 1939 నాటితోపోలిస్తే భవన స్థలావసరం 20. 13 లక్షల చ. అడుగులపైగా పెరిగిందన్నమాట.

ఇక ఈరోజున పరిస్థితి ఎలా ఉంది? ఆఫీసు భవనాలకు 39 లక్షల చ. అ. కావలసి ఉండగా 34. 2 లక్షల చ. అ. మాత్రమే లభ్యమైఉన్నది. ఇక బస సౌకర్యాలసంగతి చూస్తే పార్లమెంటు సభ్యులకు ఇంకా 156 బసలు కావల్సిఉన్నాయి. ఆఫీసర్లలో రూ. 500, అంతకుమించి జీతం ఉన్నవారికి 1. 368 బసలు, అంతకు తక్కువజీతంఉన్నవారికి 29. 017 బసలు, నాల్గవతరగతి ఉద్యోగులకు 13, 609 బసలు కొరతగా ఉన్నాయి. ఇంత కొరత ఉండగా సిమ్లాలాంటిచోట్ల ఆఫీసులకు, నివాసానికి కూడా తగిన భవనాలు బోలెడు ఖాళీగాపడి ఉంటున్నాయి. సిమ్లాలో కొన్ని వందలకోట్ల ప్రజాధనం ఖర్చుచేసి నిర్మించిన ఒక ఎస్టేటును కనీసం ఒక కోటిరూపాయల ఖర్చుతో మరమ్మతులూ అవీచేసి భరిస్తున్నారు. అంత ముఖ్యంకాని ఆఫీసులను ఢిల్లీనుంచి ఇతర చోట్లకు మార్చే సమస్యతో పదేళ్ళనుంచి బోలెడు మంత్రివర్గసంఘాలు కుస్తీపడుతున్నాయి. అయినా ఇంతవరకూ ఆకుస్తీ ఫలితానికి చేసినసుస్తీ నయంకాలేదు. అందుచేత వ్యయకర్తనం అనేమాట ప్రజలకన్నీళ్లు తుడవడానికి ఉపయోగపడే జేబురుమాలే కాని మరేమీ కాదని తెలిసిపోతోంది.

సిమెంటు, ఉక్కు కొరతగా ఉన్నాయనేది అందరికీ తెలిసినదే. న్యూఢిల్లీలో విదేశప్రభుత్వాలు భవనాలేమైనా కట్టుకోదలిస్తే మీ సిమెంటు 'మీరే తెచ్చుకోం'డని చెబుతున్నారు. ఇంతజాగ్రత్తగా ఉన్నట్టు అభినయిస్తూ మరోవంక ఆఫీసులకు, నివాసాలకు బోలెడు భవనాలు కొత్తగా కట్టిస్తున్నారు. ఇలా కొత్తవాటికి సిమెంటు తగలేసేబదులు పరిపాలనా సౌష్ఠవం ఏమీ చెడకుండానే కొన్ని చిన్న ఆఫీసులను ఇతర చోట్లకు మార్చవచ్చును గదా.

మరోచిత్రం; న్యూఢిల్లీలో మ్యూజియం భవనానికి సిమెంటును నీళ్ళలాగ ఖర్చుచేసేస్తున్నారు. జాతీయ నాటకశాల (నేషనల్ థియేటర్) కటబోతున్నారు గనుక దానికి కూడా సిమెంటును గాలిలాగ

ఖర్చు పెడతారన్నమాట. బహుశా ద్వితీయ పంచవర్ష ప్రణాళికలోకల్లా అత్యంత ప్రధానావసరం నాటకశాలే నేమో!

*　　　*　　　*

ఇటీవల ప్రకటించిన అధికార భాషా సంఘం నివేదికలో అధిక సంఖ్యాక సభ్యుల అభిప్రాయాలతో వ్యతిరేకించినందుకు డా॥ పి. సుబ్బరాయన్ గారికి 'శాస్తి' జరిగింది. డా॥ సుబ్బరాయన్ తన మాట కాదన్నందుకు కోపంవచ్చి సంఘాధ్యక్షుడు ప్రత్యేకంగా ఒక వివరణకూడా జారీచేశారు.

అధికసంఖ్యాబలంమీద ఆధారపడిన ప్రజాస్వామ్య పద్ధతే భారతదేశవిభజనకు ముఖ్యహేతువు. అంతేకాక పాకిస్తాన్‌లో తూర్పు, పశ్చిమరాష్ట్రాలకు మధ్య పచ్చగడ్డి వేస్తే భగుమనడానికి భాషా వివాదమే కారణం. లంకలో ప్రబలిన స్పర్థలకదే కారణం. భారతదేశంలో కూడా భాషా వివాదంమీదనే స్పర్థలు పెరుగుతున్నాయి. అయితే ఒక సుగుణం ఏమిటంటే భారతప్రధాని భాషాసమస్యను బాగా ఆకళింపు చేసుకున్న మనిషి. భారతైక్యతను భంగపరిచే ఏవిధానానికీ ఆయన అంగీకరించరు.

## పార్లమెంటు సభ్యుల కార్యాలు

పార్లమెంటులో తతంగం అంతా సాధారణంగా నీళ్ళు కారుతున్నట్టు నిరుత్సాహంగా ఉంటుంది. కాస్త హుషారిచ్చేది ప్రశ్నలకాలమే. ఆ సమయంలోనే మంత్రిపత్రిముల సత్తా బయటపడుతూ ఉంటుంది.

ఏ శాఖనుగూర్చి ప్రశ్నవచ్చినప్పుడు ఆ శాఖమంత్రి సభలో లేకపోతే ఆయన్ని నలుగురూ నానామాటలూ అంటారే! ప్రశ్న వేయబోతున్నానని ముందు తెలియజేసి ప్రశ్న వేయవలసిన సమయంలో గైరుహాజరయ్యే సభ్యుణ్ణి ఎవరూ ఏమీ అనరేం? సమాధానం చెప్పటానికి ప్రశ్నకు సగటున 75 రూ. లు ప్రభుత్వానికి ఖర్చు తగులుతుంది. ప్రభుత్వం ఎంతో శ్రమపడి సమాధాన వివరాలు సేకరిస్తుంది. ఇంతా చేస్తే అసలు ప్రశ్న అడిగిన పెద్దమనిషి గైరుహాజరవుతాడు. తనూ ఒక ప్రశ్న వేశానని పత్రికలో తన పేరు పడేట్టు చేసుకోవడానికేనా ఇదంతా?

ప్రశ్న అడిగిన సభ్యుడు సమాధాన సమయంలో హాజరు కాకపోతే అసలా ప్రశ్నకు పబ్లిసిటీ ఇవ్వకుండా వదిలెయ్యడంమంచిది. సమాధానసేకరణకు ఖర్చయిన డబ్బు అతగాడికిచ్చే భత్యంలోంచి మినహాయించడం కూడా మంచి పద్ధతే. పార్లమెంటు సభ్యుడికి ముట్టేడబ్బు రకరకాలుగా ఉంటుంది:

(55-వ పేజీ చూడండి)

# నే చెప్పానుగా!

ఆరుద్ర

అంతా మనలాగే ఉంటారా? మనమేదో మర్యాదగా మంచిగా మౌనంగా ఉంటాం. మన అభిప్రాయం అడిగితే చెప్తాం. అదీ చెప్పవలసివస్తేనే చెప్తాం. అందరూ ఇలా వుండరు. మామూలుగా ప్రవర్తించరు. అడిగినా, అడక్కపోయినా అభిప్రాయాలు వెలిబుచ్చుతారు, ప్రకటనలు చేస్తారు. ఉద్దేశాలు ఉద్ఘాటించుతారు. పిలవని పేరంటాలకి వెళ్ళిపోతూ ఉంటారు. అవసరంలేని విషయాలలో అర్జెంటుగా జోక్యం కలిగించుకొంటారు./ వీళ్ళంతా ఉద్దండ పిండాలు. మహామహులు. ప్రముఖవ్యక్తులు.

వీళ్ళలోకూడా రకాలవారీ మనుష్యులున్నారు. పూరా గొప్పవాళ్ళు, సగం గొప్పవాళ్ళు, లోకం ఒప్పుకున్నా తమమీద తమకు నమ్మకం లేనివాళ్లు, లోకం అంగీకరించకపోయినా తమమీద తమకి మాచెడ్డ నమ్మకమున్నవాళ్ళు వగైరా వగైరా ఎందరో మహానుభావులు. ఈ గొప్పవాళ్ళు తమ గొప్పవైన నోళ్లు తెరవగానే వాళ్లు ఏరకం గొప్పవాళ్ళో మనం పోల్చుకోవచ్చు. వీళ్లకి సూత్రప్రాయమైన ఊతపదాలు ఉంటాయి. తమ అమూల్యమైన అభిప్రాయప్రకటనలో మొదటో, మధ్యనో, కొసనో సదరు ఊతపదాలని వాడుతారు. ఆ ఊతపదాలు ఏమిటయ్యా అంటే 'నన్నడిగితే, నాకెందుకులే, టైంలేదు, ఏదో ఫరవాలేదు, నే చెప్పానుగా.' ఈ అయిదున్నూ గొప్పవాళ్ళ ఊతపదాల పేర్లు.

ఈ ఊతపదాలనిబట్టి వాళ్ళు వాళ్ళ గొప్పతనంయొక్క పవరెంతో అది ఎలా పోల్చుకోవడమో చెప్తా. హోమియోపతీ మాత్రలు చూడడానికి అన్నీ ఒకలాగే ఉంటాయి. అలాగే ఈ మహానుభావులు కూడా తేడాపాడాలు లేనట్టు కనబడతారు. సదరు హోమియోపతి మాత్రలలో ఎక్కువల తేడా ఉన్నట్టే ఈ ప్రముఖుల వాక్కులలో కూడా బోలెడంత తేడా ఉంది. నన్నడిగితే అనేవాళ్ళను తీసుకోండి. వీళ్లు కొద్దిగా నాకెందుకులే అనేవాళ్లలాగే కనబడతారు గాని నన్నడిగితే అనేవాళ్ళు తమ అభిప్రాయాలకి బాధ్యత వహించుతారు. నాకెందుకులే అనేవాళ్ళు ఫలితానికీ దానియొక్క మంచి చెడ్డలకీ బాధ్యతవహించరు. నన్నడిగితే అనేవాళ్ళు తమ మనసులోని భావాలని బయటికి చెప్పేసి 'ఆతరువాత కనబడరు. కనబడ్డా మాట్లాడరు. మళ్ళా మాట్లాడినా నన్నడిగితే అనే ఇంకో సంగతి చెప్తారు. టైంలేదు అనేవాళ్ళు నిజంగా నొప్పించక తానొవ్వక తప్పించుకు తిరిగే వాళ్ళు. వీళ్ళకి ఎప్పుడూ టైము ఉంటూనే ఉంటుంది. అది లేదని బయటికి చెప్పడంలోనే ఆ టైమంతా వృథాచేస్తారు. అయినా వాళ్ళు గొప్పవాళ్ళే. ఇక ఫరవాలేదు అనేవాళ్ళు అందరికన్నా గొప్పవాళ్లలాగ కనబడతారు. నారదుడొచ్చి పాడినా వీళ్లకి ఓమోస్తరుగానే వినబడుతుంది. ఫరవాలేదు పనికొస్తాడు అంటారు. రంభ నాట్యమాడినా, మయుడు అద్భుత విచిత్రశాలలు నిర్మించినా ఫరవాలేదు అనేవాళ్లకి ఓమోస్తరుగానే ఉంటాయి. వీళ్ళకి తృప్తి అన్నదిలేదు. పెరఫెక్షను అన్నది వీళ్ళపరమావధిలాగా కనబడుతుందిగాని అదికూడా వీళ్ళకి సరిపోదు. అందుచేత, నేను మనవి చేసిన ప్రముఖులలో అగ్రతాంబూలం వీరికే ఇవ్వాల్సి ఉంటుందేమో అనిపించవచ్చుగానీ, అందరికన్నా గొప్పవాళ్ళు నేచెప్పానుగా అనేవాళ్ళు. వీళ్లు ఒకరకంగా చూస్తే నన్నడిగితే టైంలేదు ఫరవాలేదు అనే మనస్తత్వాల కలగలుపు. వీళ్లు ఏవిషయానికైనా మొట్టమొదట కట్టకడ ప్రకటన బడుతూ ఉంటారు.

వీళ్లు రామాస్వస్తి రావణాస్వస్తిగాళ్ళు. ఏ ఎండ కాగొడుగు పట్టేస్తారు. జాగిలాలతో వేటాడుతారు. కుందేళ్ళతో పరిగెడతారు. మందార మకరంద మాధుర్యముల దేలు మధుపమ్ము పోవునే మరో చోటుకి. అందుచేత వీళ్ళు ఎటుగెలుపుంటే అటే చేరుతారు. ఆ సంగతి తమకి తొలిదగ్గరనుంచి తెలిసినట్టే నటిస్తారు. అది నటన అని తెలియనివ్వకపోవడంలోనే ఉంది వాళ్ళ ప్రాముఖ్యం.

ఇది బొత్తిగా మరీకలికాలం కాబట్టి నే చెప్పానుగా అనేవాళ్ళు ఊసరవిల్లిలాగ, తైరుకొట్టేవాళ్ళలాగ పెద్దమనుష్యులలాగ చెడ్డవాళ్ళలాగ మనకి కనబడతారు గానీ కృతయుగంనుంచీ ఇలాంటివాళ్ళు లేకపోలేదు. సత్యకాలపురోజుల్లో సత్యకాలపు మనుష్యులలోకూడా ఈ నేచెప్పానుగా అనే వాళ్ళు ఉన్నారు.

మాటవరసకి వశిష్టుణ్నే తీసుకోండి. ఈ గురుదేవుడు హరిశ్చంద్రుడు అష్టకష్టాలు పడ్డాక అంతిమ విజయం సాధించాక చక్కా వచ్చి నేచెప్పానుగా హరిశ్చంద్రుడు అబద్ధం ఆడడు అని చెప్తాడు. నిజమే ఈయన ముందే చెప్పాడు. బాగానే ఉంది. బ్రహ్మ విష్ణు మహేశ్వరులు ప్రత్యక్షమైనప్పుడే ఈయనా ప్రత్యక్షమై హరిశ్చంద్రుడుగారు అమాంతంగా అర్ధాంగలక్ష్మి తలకొట్టేసే సమయానికే, ఆ ఘట్టాన్ని నాటకంగా చూస్తున్న ఆడియన్సుల కన్నీళ్లతో జేబురుమాళ్ళు తడి పోసిన వేళకే ఈయన సర్రిగ్గా దిగడిబ ఏమయ్యా విశ్వామిత్రుడా, నేను చెప్పలేదూ అంటే ఎలా ఉంటుంది, చెప్పండి. మాటామాటా వచ్చి వాళ్లూ వాళ్లూ పోటీలు పడి మధ్య నొకణ్ణి ఇలా బాధపెడతారూ? పెట్టేరు మనమేం చేస్తాం. ఆ నాటకం ఆడుతున్నప్పుడల్లా స్నేహితులతో పాటు చూడడానికి వెళ్తాం. చూస్తాం. చూస్తున్నంతసేపూ మన పక్కనే కూర్చున్న మిత్రరత్నం నేచెప్పలేదూ–ఈ ఘట్టంలో ఫలానాయాక్టరు, ఫలానారాగంలో పాడుతాడనీ అంటూ మన చెవి కొరుకుతూంటే అది కూడా సహిస్తాం.

దేవతలలోనూ, దేవత్వం వున్నవాళ్ళలోనే కాదు రాక్షసులలోనూ నేచెప్పానుగా అనేవాళ్ళు పూర్వంనుంచీ వున్నారు. ఓరే మాయలేడి వేషం వేసుకుని రాముణ్ణి మరపింతాలు పెట్టరా అని రావణాసురుడు మారీచుడితో చెప్పాడు. ఒద్దురా స్వాములారి వేషం వేసుకుని రాముడిభార్య జోలికి పోకు. అని మారీచుడు ఎంతో చెప్పాడు. రావణాసురుడు వినలేదు. చచ్చిపోయిన వాళ్ళలోకంలో మారీచుడు రావణాసురుణ్ణి కలుసుకున్నాక నోరు తెరచి చెప్పిన మొదటి మాటలు నేచెప్పానుగా అనేవే అయి ఉంటాయి.

వీళ్ళందరూ ఒక యెత్తు. శ్రీకృష్ణుడు ఒక యెత్తు. అతడంత పాలిటీషియన్ ఇంకొకడు లేడు. అనవసరంగా నారదుణ్ణి కలహప్రియుడంటారు గాని ఆదినుంచీ ఆ శ్రీకృష్ణపరమాత్ముడు వీళ్ళకీ వాళ్ళకీ ముడిపెట్టి ఆనందించేవాడు. పైపెచ్చు చివర్న నేచెప్పానుగా అంటాడు. మాయముని వేషం వేసుకుని అర్జునుణ్ణి కొండమీద ముక్కు మూసుకొని కూర్చోమన్నవాడూ ఆయనే. బలరాముడూ ఆమాయాముని సపర్యలకి సుభద్రని నియమిస్తున్నప్పుడు జాగ్రత్త అన్నయ్యా– ఏం మునుగుతుందో, అని వార్నింగ్ ఇచ్చినవాడూ ఆయనే. సుభద్రనిచ్చి పెళ్ళిచేసి అర్జునుణ్ణి ఎత్తుకుపొమ్మని చెప్పి చూశావా అన్నయ్యా, నేను అవాళే చెప్పానుగా, అన్నవాడూ ఆయనే. నేచెప్పానుగా అనే ప్రముఖులకి ఆదిపురుషుడు ఈ దివ్యపురుషుడే.

బలరాముడు కనబడ్డప్పుడల్లా శ్రీకృష్ణుడు నేచెప్పానుగా అనేటట్టే మనకు కనబడుతుంది. పాండవుల తరఫున కౌరవసభకి రాయబారం వెళ్ళాడు. అక్కడ చెప్పవలసినవన్నీ చెప్పాడు. జెండాపై కపిరాజు మొదలైన పద్యాలు చదువుతాడు. సంతోషంబున సంధిచేయమంటాడు. కౌరవులు వింటారా? కాళ్ళూ చేతులూ కట్టేయబోయి కయ్యానికి కాలుదువ్వారు. యుద్ధమైంది. చచ్చిరి సోదరుల్ సుతుల్ చచ్చిరి దుర్యోధనుడు మడుగులో దూరి జలస్థంభన కావించాడు. ఎత్తిపొడుపులుపొడిచి రాజరాజుని బైటికిలాగుతానని భీముడు ముందుకొచ్చాడు. అబ్బాయ్ నువ్వుకాదు మీ అన్నయ్య ధర్మరాజు ఎత్తిపొడిస్తేనే బయటకొస్తాడని చెప్పి కృష్ణుడు చతురంభోధి పరీతమైన ధరణీ చక్రంబు శాసించి అనే పద్యాలు చదివిస్తాడు. దుర్యోధనుడు బయటకొచ్చి గదాయుద్ధానికి తలబడ్డప్పుడు బలరాముడు వచ్చి తమ్ముడిని తిడతాడు.

సంధి గావింపకుందువే చతురుపాయ
ముల నెఱింగిన బుద్ధికౌశలము గలవు
ఈత్తవైరంబు బెంచితి రిత్త నేల
ధరించి సుఖించునే ధర్మరాజు.

అని బలరాముడనగానే, కృష్ణుడు నేమంటే చెప్పానుగా, అంటూ అన్నయ్యా నామీద లేని యపవాదు మోపిన నేనేమందును. అద్దమున్నది మొగమున్నది; దుర్యోధనునే యడుగరాదా, అయిదూళ్లిచ్చిన పాండవులకు చాలునని నేబలికితినో లేదో అని చల్లగా చెప్తాడు.

అది ద్వాపరయుగం కాబట్టి, ఎంత

#  నే చెప్పానుగా 

చెడ్డా ధర్మం రెండు కాళ్ళమీదనైనా నడచేది కాబట్టి మొట్టమొదట ఫలానారకంగా జరుగుతుందని చెప్పి కట్టకడపట నే చెప్పానుగా అనేవారు అలా అనడం బాగానే ఉంది. ఇప్పుడు ఘోరకలి ముండిపోతున్నది కాబట్టి ముందు ఏమీ సెలవియ్యకుండానే అన్నీ అమర్చినదాంట్లో అత్తగారు వేలు పెట్టినట్టు ప్రముఖులు అఖిరుఘట్టంలో హాజరయి నేచెప్పానుగా అని తయారవుతారు.

మనుష్యులెందుకిలా అంటూఉంటారన్న విషయం కొంచెం ఆలోచించవలసినదే. పర్యవసానంకోసం ఈషణ్మాత్రం పాటుపడకుండా, ఫలితం తేలిన వేళల్లో పక్షిలాగ రెక్కలు కట్టుకొని, వాలి, ఆ ఫలితమంతా తమ ప్రయోజకత్వమే అని బావుకొందా మనుకోడంలోనే నేచెప్పానుగా అనే జబ్బుకి పునాదిఉంది. పరాన్నభుక్కుతనం పెరిగినకొద్దీ ఈ జబ్బు వింతవింత రూపాలు ధరించడానికి వీలుచిక్కింది. రాతిగొడ్డలి, రాతికత్తి చేసుకోనడంలోనూ, చేతులారా తిండి సంపాదించుకోనడంలోనూ సతమతమయ్యే ఆదిమమానవుడుఎప్పుడూ నేను చెప్పేనుగా అని ఉండెడు. చాతుర్వర్ణాలు ఏర్పడ్డాక కొందరికి తీరుబాటు దొరికాక పర్యవసానం నిమిత్తం పాటుపడకుండా ఫలితాలు జుర్రుకోనడం మొదలయిన దగ్గర్నుంచి ఈ నేచెప్పానుగా అని గొప్పలు చెప్పుకోనడం ప్రారంభం అయిందని నా ఉద్దేశం.

పొలంనుంచి పంటవస్తే కాలుమీద కాలు వేసుకుని కబుర్లుచెప్పే మహానుభావులు ఎంతకైనా తగినవాళ్ళే. రాంభజన మందిరం ఆవరణలోనో, రచ్చబండమీదో కూర్చుని పిచ్చి మాట్లాడేటప్పుడు గంటసేపు సాగే సంభాషణలో కనీసం అరడజనుసార్లయినా నే చెప్పానుగా అనే మాట మనకి వినబడకతప్పదు.

గొప్పలు చెప్పుకోనడం మెప్పు సంపాదించడం మానవనైజమే అనుకోండి. దమ్మిడీ ఎత్తు పనిచెయ్యకుండా పల్లెత్తు మాటసాయం చెయ్యకుండా మెప్పుకొట్టేద్దా మనుకునే వాళ్ళే ఇలా బయటపడిపోతూ ఉంటారు. నిజంగా చెప్పినవాడు బయటికి చెప్పనే చెప్పడు. అతడిదగ్గరకే చెప్పించుకొన్నవాడు వెళ్లి బాబూ మీరు చెప్పారండి గానీ, మొదలెడతడు. ఆ చెప్పిన ఆయన మొహమాటపడి పోనిద్దూ అంటాడు. అలా అనడంచేత, ప్రచారం కోరుకోనకపోవడంవల్ల అతడు సాధారణవ్యక్తిగా ఉండిపోయాడు. స్వంత బాజా రెండుచేతులా వాయించుకొనేవాడు ఎండుతాటాకు మంటలాగ నిముషంలో ప్రముఖుడైపోతాడు. మంట చల్లారినా మాటలు చెప్పడం మరచిపోలేడు. ఇవాళ గురువారం అని మీరన్నారనుకోండి. ఈ సంగతి నేను నిన్ననే చెప్పానుగా అని తడుముకోకుండా చెప్పేస్తాడు. ఈరోజు గురువారం కావడానికి తానే కారణంఅయినట్టు, మనల్ని భావించమంటాడు.

ఇలాంటివాళ్ళని చూశాక త్యాగరాజస్వామి పాడినట్టు ఎందరో మహానుభావులు అందరికీ వందనములు అని ఒక్క దండం పెట్టాలనిపిస్తుంది, గాని, నన్నడిగితే, నాకు తెలుసు, ఫరవాలేదు, టైంలేదు, నేను చెప్పానుగా అనే ప్రముఖులందరూ కళ్ళముందు నిలబడగానే అందరూ మహానుభావులు ఎందరికని వందనాలు అని విసుగెత్తి మానేస్తాం. 

చలచిత్ర కథలు

# విక్రమార్కుడి మార్కు సింహాసనం

ఎస్. పార్థసారధి

రెండువారాల క్రితం మద్రాసు సెంట్రల్ రైల్వేస్టేషనులోని రెండో నెంబరుప్లాటు ఫారం మీద నిలచి సాహసంతో కుడికాలు ఎత్తిన వరహాలరాజు ధైర్యంగా, ధీమాగా గాఠిగా ఆ కాలును నేలమీద మోపాడు. నేలకీ, అరికాలికీ మధ్య ఒకానొక బలసిన కొండ అరటిపండు తాలూకు దళసరితొక్క ఉండడం వల్ల, ధైర్యంగా, ధీమాగా రెండోఅడుగు వేయబోయిన రాజు ప్రయత్నానికి ద్వితీయవిఘ్నం లాటిది వాటిల్లింది అయినా, ఆ ప్రయత్నం అవసరం లేకుండా ఆ కుడికాలు మీదనే ఎక్కి అతడు చాలా అర్జెంటుగా ఐదారు గజాలదూరం, వెళ్లిపోయాడు, పెట్టిసహా. ఆ స్పీడుని అలాగే ఉండనిస్తే కాస్సేపటిలో బస్సు అవసరం కూడా లేకుండా కోడంబాక్కం చేరుకునేవాడేగాని, మధ్యలో ఒకాయన తెలిసినట్టు కనబడడంతో ఆయన భుజం పట్టుకొని హాలో అని ఆగాడు. ఆయన బోల్డు ఉన్నందువల్ల ఇతడే బోల్తాబడిలేచి, సారీ అని ఆ మొహం చూచి అట్టే ఆశ్చర్యపడి మళ్ళీ లేచి, హాయ్యబా బోయ్ అన్నాడు.

ఎదటిమనిషి విస్తుపోయాడు. "సార్ ... మీరు...యు...ఐ యామ్ ఎ సినిమా ... ఆవాళ్ళరోజు నే...యూ. మీ...." అన్నాడు రాజు కర్తకర్మ క్రియలను వరుస ప్రకారం పేర్చి ఖాళీలు భర్తీ చెయ్యడం వాయిదా వేసి.

"వాట్ సార్ ...వాటయు...వాట్ మీ? యూరనీ? ఎన్నా ఇదెల్లాం?" అన్నాడు. లావుపాటి ఆసామి చిరాకులోనే కాస్త జాలిరంగరించి.

"నో సార్ ...యు ఆరెనైట్ ... అయామే టికెట్...మీరు...అవేళ రాత్రి సినిమాలోంచి ఊడిపోయారు కదండీ. ...అప్పుడు మేమందరం మళ్ళీ మమ్మల్ని ఎక్కించెయ్యలేదు?... నేను మీకు తెలీదూ...సన్మానం చేస్తానన్నాడు కూడా మావాడూ,"

"యన్నయ ముతాళ్ మాదిరి ...ఎన్న... ఊళ్రడది." అన్నాడు ఎల్. ఆసామి.

"ఏం చేస్తాం. మీరు కోస్తున్నారు నన్ను ఎరగనట్టు. మీరు మహానటులనుకోండి స్వామీ అవేళే అడుగుదామనుకున్నా మీతో కలిసి తెరలోకి అప్పుడే ఎక్కిపోనా అని...పోనీ ఈపూరొచ్చి అడగొచ్చుకదా.. అనుకుంటే. ఏంచేస్తాం మీరు కోస్తునారు నన్ను ఎరగనట్టు!" అని దిగులుగా ప్రాధేయపూర్వకంగా చూశాడు రాజు. అతనికి భయంవేసింది ఎదటి మొహాన్ని చూసి. ఏం తోచక పాతపాట పల్లవినే పట్టుకు పుంజుకున్నాడు గాడిచెడిన గ్రామఫోనులా. "ఏంచేస్తాం...మీరు కోస్తున్నారు నన్నెరగనట్టు ఇంకేంచేస్తాం మీరు కోస్తున్నారు... ఇలా పల్లవిని కొంతసేపు ఆలపించే సరికి కొండవంటి ఎదటిమనిషి మంచల్లె కరిగి మాయమైపోయాడు.

"హమ్మయ్య" అనుకుని రాజు మళ్ళీ ముందడుగు వేశాడు...అలా అడుగులు వేస్తున్నాడు కాని అతని బుర్రలో ఇందాకటి రైలు పరిగెడుతోంది. మూడ్రోలు క్రితం చూసిన సినిమా ఇంకోమూల మ్యాటినీలా ఆడుతోంది. బైరాగి, లావుపాటి ఆసామీ, కూడా కాస్త చోటుచేసుకుని డైలాగులు చెబుతున్నారు. ఇలా నుదురుమీద ఇవన్నీ తిరిగితే సూపర్ ఇంపోజా పాటు అంటారని జ్ఞాపకం వచ్చింది అతనికి. ఆనక, తెలుగు సినిమాలోని నేపథ్యపు పాట ఓటి మననం చేసుకుంటూ,



స్వాతంత్ర్యోత్సవాల సందర్భంలో విద్యుద్దీపాలంకృతమైన సెంట్రల్ స్టేషను.
ఫొటో: టి. వాసుదేవన్-మద్రాసు.

కొంతదూరం సాగిపోయాడు.

అతని చేతిలో పెట్టి, 'బస్సెక్కు బ్రదర్ ఎంతసేపు మోస్తావు' అంది.

'మరే నువ్వు నాగానివి కూడా కావు' అన్నకిప్పై డైలాగు కూడా అనుకుని, ఒక వడివేలు నడిగి బస్సెక్కి పాండిబజారులో దిగాడు......

పూటుగా గాలిపీల్చి హమ్మయ్య ఈ లోకంలో పడ్డాం అనుకున్నాడు సంతోషంగా.

"మెడ్రాసులో ఎవర్నీ నమ్మకు, మూర్ మార్కెట్టుకి వెళ్ళకు, అరవం నేర్చుకో, ధైర్యంగా ఉండు డబాయించి బతుకు' అని తన నేస్తం ముత్తెం చెప్పిన మాటలు అతనికి ఆకాశంలోంచి ముందర మెల్లిగా, ఆనక కొంచెం గట్టిగా, తరవాత ఇంకా గట్టిగా వినిపించాయి.

'అబ్బ ఉండవోయి కోఫితా గాలి' అని విసుక్కుని, ఆపనిచేశాడు. ఆనక గుట్టు చెప్పకుండానే ఒక పత్రిక ఎడ్రసు కనుక్కుని అక్కడకు వెళ్లాడు.

ఒకాయన తలవంచుకు రాసుకుంటున్నాడు ఒకగదిలో.

'డబాయించి బతుకు' అని ముత్యం మళ్ళీ చెప్పాడు నేపథ్యం లోంచి.

"ఏవండి నాగేశ్వర్రా విక్కడ" అన్నాడు గడపమీద నించుని గంభీరంగా.

"ఏ నాగేశ్వర్రావండి?"

"ఇంకే నాగేశ్వరావు. ఆ నాగేశ్వర్రావే" అన్నాడు రాజు ఇంకా గంభీరంగా.

"ఇక్కడ అ. నాగేశ్వర్రావు అని ఎవరూ లేరు. అ. నాగేశ్వరరావు, ఆర్. నాగేశ్వరరావూ ఉన్నారు."

"తెలుసు" అన్నాడు రాజు టెక్కుగా.

"ఎవరు తెలుసు?

"ఆ నాగేశ్వర్రావు లిద్దరూ తెలుసు."

"మళ్ళీ అదేమాటా? ఇక్కడ అ. వారూ ఆర్. వారూ ఉన్నారంటే—" అన్నాడు పత్రికలో ఆయన కొంటెగా.

"అదేనండీ. నేనడిగేది. మొదటాయన సంగతి."

"ఓహో ఆయనా? అలా చెప్పరాదూ ఏం గిరాకి?"

"పనుంది."

"ఎడ్రసు తెలీకుండా ఎలా వచ్చారు"

"పాఠకుల ప్రశ్నల్లో అడిగితే, 1953 ఏప్రిల్ 15 వ తేదీ దాంట్లో ఉందని వాళ్ళ వళ్ళో జవాబిచ్చారు. అయినా ఎడ్రసు

(54-వ పేజీ చూడండి)

# సత్యాగ్రహం

"ఏడు కొండలెను
గోడికూసెను
తెల్లవారెను
మెల్ల మెల్లన"

రాజయ్య ఇల్లు శుభ్రం చేస్తున్నాడు. వంటింట్లోంచి సరోజ హడావిడిగా హాల్లోకి వచ్చి "ఏరా ... ఆమూల రేడియోమీద దుమ్ము అట్లాగే వుందేం?" అని అడిగింది.

"ఇపుడే తుడిచానమ్మా"

"ఓరీ! చూస్తూచూస్తూ వుండగా నే ఇంత అబద్ధమట్రా!"

"నిజంగా ఇపుడే తుడిచానమ్మా."

"మరి ఇంత ధూళి ఎక్కడిదీ?"

"అదేమో? బహుశా ఈ హైడ్రోజను బాంబులు పేలడంవల్ల—"

"బావుంది. చాలబావుంది. ఆయన విన్నారంటే నీ బుర్ర పేలుతుంది." అన్న సరోజకు ఇంకా ఆరోజు 'ఆయన' అన్న వస్తువు చలామణీలోకి రాలేదని స్ఫురించింది.

"ఏవండోయ్"

"ఆహా!"

"లేవండీ..."

"ఓహో!"

"ఏమిటీ ఆహా-ఓహోలు?" అని శేషగిరి రెండు చెవులూ పట్టుకుని లేపి కూర్చోబెట్టింది సరోజ.

"అబ్బే. మరేమీ లేదు. పొద్దునే నీవలా వచ్చి పక్కన కూర్చుని 'ఏవండీ - లేవండీ' అని మధురమధురంగా, లలిత లలితంగా, యతిప్రాసలతో పలుకుతుంటే హృదయం-"

"కవిత్వం - చంద్రుడూ వగైరా వచ్చింతర్వాత! ముందు ముఖ ప్రక్షాళనం కానివ్వండి."

"అవశ్యమల్లే కానిండు."

"ఏవండీ"

"ఎస్"

"కాఫీ ఎట్లా వుందీ..."

"ఏ కాఫీ?"

"ఏ కాఫీ ఏమిటీ? మీరు తాగుతూ వున్నదీ..."

"ఐ యామ్ సారీ... నేను త్రాగుతోంది కాఫీకదూ..."

"అవునండి! మేం చేసిఇస్తే అది కాఫీ ఎలా అవుతుందీ?— మీ అక్కయ్యో, చెల్లెలో, అంత టర్పెంటైనూ ఇంత పెట్రోలూ కలిపి ఇస్తే 'ఆహాహా' అని తాగుతారు."

"సరోజా, సరోజా, ... శ్రావణశుద్ధ పౌర్ణమిపూట అలా మావాళ్ళమీద పడి పోకూ...పాపం! ఎక్కడో వందల మైళ్ళ దూరంలో వున్నారు."

"ఇంతకూ నేనేగా పరాయి దాన్ని!"

"పాపము శమించుగాక...సందు దొరికితే మావాళ్ళమీద అస్త్రాలు సంధించకూ— అన్నా. అంతేగాని..."

"పొద్దున్నే ఇదెందుకుగాని,... ఇవాళ సాయంకాలం నన్ను ఎగ్జిబిషన్‌కు తీసుకు వెడతారా - లేదా?"

## రంగారావ్

"ఏ ఎగ్జిబిషనూ?"

"రోజూ అడుగుతున్నదేగా..."

"ఓకే...అలాగే! వెళ్ళిపోదాం"

"నిజమేనా?" అని కుర్చీ ప్రక్కకొచ్చింది సరోజ.

"ఖచ్చితంగా"

"మావారు ఎంత మంచివారో..." అని సరోజ శేషగిరి మొహానికి మొహం ఆనించి, పరుగెత్తుకు వెళ్ళిపోయింది.

శేషగిరి కాఫీ ముగించి కప్పు క్రింద పెట్టాడు. కుర్చీనుంచి ఎగిరి ఒక్క గంతేశాడు. కప్పును, కుర్చీకాలు ధృతరాష్ట్రుడిలా కౌగలించుకుంది. సరోజవంటింటినుండి పరుగెత్తుకొచ్చింది.

"సరోజా!"

"ఏమిటండీ?"

"ఎగ్జిబిషనుకు ఇవాళ వీలులేదు."

"ఏమంటున్నారూ?"

"సాయంకాలం ఎగ్జిబిషనుకు వెళదాం అనుకున్నాం కదూ..."

"ఊఁ."

"అలా జరగడానికి నయాపైసాఅంత అవకాశం కూడా లేదు."

అపుడే అనుకున్నాను—ఇంత హఠాత్తుగా ఒప్పుకున్నారే—అని."

"భేష్! ఆదర్శసతీమణి అంటే నీవే సుమా..."

"భట్రాజు దండకాలు దండుగ..."

"అసలు విషయం తెలుసా?"

"తెలియక్కర్లేదు."

"ఎంతమాట! భావిభారత పుత్రుల తల్లివి కానున్న నారీమణివి, వీరపత్నివి—నీవు అలా త్రోసిపారేయడానికి వీలులేదు." అని నాటకం హీరోలా సరోజచేతిని తన రెండుచేతుల మధ్యకు తీసుకున్నాడు.

"అవతల కుంపటి—"

"ష్...అలాంటి చిల్లర విషయాలకు ఇపుడు అవకాశంలేదు. ఇవాళ విశేషం ఏమిటో ఎరుగుదువా?"

"ఏమిటి?"

"ఆఫీసు లేదు."

"ఆదివారం కాదుగా."

"అవును."

"పండగరోజు కాదుగా"

"కాదు. కానీ...అమ్మాయ్! నీ మొగుడుగారు పనిచేస్తున్న శాఖవారు ఇవాళ జీతాల హెచ్చింపు కొఱకు సమ్మె చేస్తున్నారు... సమ్మె!"

"ఓస్...ఇంతేనా..."

"ఏమిటి...! విశాల భారతంలో కాశ్మీరు మొదలు కన్యాకుమారి వఱకూగల ఉద్యోగస్థులందరూ బుర్రలు బద్దలుకొట్టుకుని ఆలోచించి, చచ్చిచెడి ఐకమత్యం తెచ్చుకుని సమ్మెచేస్తూంటే నీవు—'ఇంతేనా' అంటున్నావు..."

"ఈ విషయం ముందే చెప్పవ కూడదూ?"




గురించి వివరించటం మొదలుపెట్టినప్పుడు..."

"భోజనానికి లేవండి"

వడ్డిస్తూ "ఏమయింది మీ సమ్మె?" అంది సరోజ

నోట్లోవున్న ముద్దను గభుక్కున మింగి "అర్ధాంగి అటులనుట న్యాయమే! ఇంత సేపూ ఆవిడతో ముద్దుముద్దుగా 'మా రేడియో' 'మా కారు' అన్నట్టు 'మా సమ్మె మా సమ్మె' అని మాట్లాడి— ఇప్పుడు "మీ సమ్మె" అంటున్నావే.. ప్లేటు ఇలా మారిస్తే."

"సరే బాబూ సరే! ఎలా వుంది మన సమ్మె?"

"ఆ...అదీ వరస! మన సమ్మెకేం— దివ్యంగా సాగుతూంది"

# ★ సత్యాగ్రహం ★

"ఏదీ.. నీచేతి కాఫీ తాగితేదాక గుర్తుకు రానిదే."

"సరే సరే.. నాకా ఎగ్జిబిషను చూసే రాత లేదు."

అబ్బే! అలా నిరాశతో నిండిపోకు. ఇవాళ సమ్మె కమిటీకి ప్రభుత్వంవారు రాబోయే ఏ పాతికరూపాయలో జీతం పెంచిస్తారు ఆ అంటే—ఝామ్మున ఎగ్జిబిషనుకు—టాక్సీలో వెళ్ళిపోదాం ఏం. సరేనా?"

"ఊఁ" అని నోరు వంకరలు తిప్పింది సరోజ.

"అహా! ఏమా సోయగము!"

"నే పోతున్నా..."

"అలాగే."

"మరి చేయి వదలండీ."

"ఓ.. మరి నేను అలా వీధిలోపడి సమ్మె ఏమయిందీ, ఎందాక వచ్చింది, నాయకులు ఏమంటున్నారు, మన పాతిక రూపాయలు ఏమయాయి, వగైరా భోగట్టా కనుక్కువస్తా—" అని శేషగిరి బయటకు వెళ్ళిపోయాడు.

మిడిమిడి ఎండలో తిరిగితిరిగి, గొంతు చించుకుపోయేటట్లు అరిచి, చచ్చిసగమై మధ్యాహ్నం ఒంటిగంటకు శేషగిరి ఇల్లు చేరుకున్నాడు. హాల్లో ఈజీచేరులో చేరబడ్డాడు.

వంటింటిప్రక్క వసారానుంచి ఆడ గొంతుకలు వినిపిస్తున్నాయి. 'ప్రశ్నలూ—జవాబులూ' కాస్త ఘాటుగానే సాగుతున్నాయి.

"నేనంటున్న దేమిటంటే మా ఆయనకన్న మీ ఆయనకు ఓముప్పై రూపాయలు ఎక్కువ వస్తాయికదా— మీ ఆయన వాళ్లు సమ్మెచేయడం ఏమిటి—అని"

"అదేం దద్దుప్రశ్న? మాకు జీతం చాలలేదూ—అందుచేత మరికొంత కావాలని సమ్మెచేస్తున్నాం"

"మరి మా జీతంమాత్రం మాకు చాలుతుందేం?"

"చాలక పోవచ్చు"

"మరి మా ఆయనా వాళ్ళూ సమ్మెచేయనక్కరలేదా?"

"చేయాలి"

"మరి చేయరేం?"

"అదేమో బహుశా మీ వాళ్ళ" ఆమాత్రం ఐకమత్యం లేకపోవచ్చు.. లో

"దరిద్రంలో కొట్టుకులాడుతూన్నప్పుడు కూడా అనైకమత్యమే?"

"అలాగే అనిపిస్తోంది—మరి"

"అదేదో అంతు కనుక్కోవాలి. మా ఆయన వాళ్ళకు మాత్రం ఎందుకు సమ్మె చేయరూ—అని... ఇవాళ ఆయన ఆఫీసు నుండి రాగానే అదేదో తేల్చుకుంటా.."

—ఇదంతా ఏ పక్కింటి రేడియోనుంచో విన్పిస్తున్న మహిళల ప్రోగ్రాము కాబోలు ననుకున్నాడు శేషగిరి మొదట. కాని వంటింట్లోనుండి హాలుదాటి వెళ్ళిన కాంతను చూచి,

—"ఓహో! సమ్మెను విమర్శించింది మా ఆవిడా, వాళ్ళాయనచేత సమ్మెచేయాలని కంకణం కట్టుకున్నది ఈవిడానా?"— అనుకున్నాడు శేషగిరి

"ఎప్పుడొచ్చారండీ మీరు?" సరోజ హాల్లోకి వచ్చింది

"నీవు ప్రక్కింటావిడకు మా సమ్మెను

## యుద్ధపద్ధతి

"యుద్ధాలెలా వస్తాయి నాన్నా?" అని అడిగాడు అబ్బాయి.

"ఏం లేదురా, మనకీ అమెరికావాళ్ళకీ ఏదో డబ్బు దగ్గరో, ఎక్కడో పేచీ వస్తుందనుకో.."

భర్త మాటలకి భార్య అడ్డం వచ్చి "మీరిలాంటివన్నీ వాడికి నేర్పిపెట్టకండి. అమెరికావాళ్లు డబ్బు దగ్గర ఎప్పుడూ దెబ్బలాడరు," అంది.

"ఎందుకు దెబ్బలాడరూ? డబ్బుదగ్గర ఎవరైనా ఒకటే," అన్నాడు భర్త

"కాదు," అన్నది భార్య.

"అవు" నన్నాడు భర్త.

"అఘోరించార్లెండి"

"ఏడిశావులే"

"నోరు ముయ్యండి"

"ఆఁ," అంటూ భర్త కొట్టడానికి లేచాడు.

అబ్బాయి అడ్డపడి "తెలిసింది నాన్నా. యుద్ధాలిలాగే వస్తాయన్నమాట. బలేగా ఉందే," అని మురిసిపోయాడు.

"సాగడం కాదు ... అసలు విషయం ఏమయినా—"

"అదా ... రాత్రి ఢిల్లీనుండి వార్తలు రేడియోలో విను. పాఠకరూపాయల హెచ్చింపుగురించి వింటావు. ఆ! అంతే దానికి తిరుగు లేదు."

"మీకు అంత నమ్మకం వుందా?"

"ఆహా! ప్రభుత్వం మా సమ్మెకు ఒక్క రోజు తట్టుకోలేదు. చచ్చినట్టు క్రిందకు దిగి తీరవలసిందే!"

"అయితే ఎగ్జిబిషనుకు రేపు వెళ్ళడం ఖాయమే నన్నమాట."

"ముమ్మాటికీ!...మరి నీ వింత సేపూ సమ్మె తరఫున మన ప్రక్కింటావిడతో

వాదించావుగా...అందుకు బహుమతి ఇవ్వద్దూ?"

"మరేమిటండీ? వాళ్ళాయినా వాళ్ళూ సమ్మె చేయలేదుట." అంది సరోజ పులుసు వడ్డించబోతూ.

"పాపం" అన్నాడు శేషగిరి.

చేతిలోని పులుసుగరిట నలాగే పైకెత్తి పట్టుకుని సరోజ "ఏం" అంది.

"ఆ...ఆ...ముందు ఆగరిట క్రిందకు దింపూ...పులుసు చీరమీద పడగలదు" అని సరోజచేతిని క్రిందకు దించి,

"ఇప్పుడు చెబుతా విను—మా కంపెనీ సంఘమూ వర్కర్లా ఏడిశాయి. వాళ్ళకవి లేవుగా..."

"అయితే?"

"అందరూ ఒక్క తాటిమీద నిలబడక పోతే సమ్మె ఎలా చేస్తారూ?"

"ఔను."

"వాళ్ళాయనచేత సమ్మె చేయించి తీరుతానని వెళ్ళిందికదా ఈవిడ!—పాపం ఆయన సాయంత్రం ఇంటికి రాగానే ఎన్ని గండాలున్నాయో అని బాధగా వుంది..."

"ఉండదూ...తోటి మగప్రాణిగా..."

"మరే..."

"చాలు చాలు! ఆయనకు మీ సానుభూతేం అక్కరలేదు."

—సాయంకాలం ఏడింటికి శేషగిరి బ్రహ్మాండమయిన ఊరేగింపులో వున్నాడు. అదయిన తర్వాత సమ్మెకట్టినవారు సభ జరిపారు. ఉపన్యాసాలు అయిపోయాయి. ఆ తర్వాత చెవులు నిక్కపొడుచుకుని పార్కు రేడియోలో వార్తలు విన్నారు.

"ఇవాళ ఫలానావారు సమ్మె చేశారు... ప్రభుత్వంవారు ఈ విషయమై ఎలాంటి ప్రకటనా చేయడానికి నిరాకరించారు. ఈ సమ్మె రేపుకూడా జరుగుతుందని భావిస్తున్నారు—"

శేషగిరికి సగంప్రాణం పోయింది. ఇల్లు చేరుకున్నాడు.

హాల్లో లైటు లేదు. వంటింటికి గొళ్ళెం పెట్టివుంది. రేడియో ఏదో పలుకుతూంది. సరోజ పడకగదిలో మంచంమీద బోర్ల పడుకుని వుంది.

'రేపుకూడా ఎగ్జిబిషనుకు వెళ్ళే అవకాశం ఉన్నట్టు కనుపించనందువ ఇవాళ నుంచే సమ్మె' అని వాతావరణం శేషగిరి చెవిలో ఘోషించింది.

ఎందుకో దాచుకున్న మూడు రూపాయలు పట్టుకుని దగ్గర్లో చూపెడుతున్న ఒక తెనుగుసినిమా సెకెండుషోకు రెండు టిక్కెట్లు పట్టుకొద్దామని—'సిరికిం చెప్పడు'—ధోరణిలో పరుగెత్తాడు శేషగిరి.

శేషగిరిని చూచి "పాపం!" అనుకున్నాడు ప్రక్కింటి శాంత మొగుడు. ★

# నయాపైసా దండకం

శ్రీదేవి విన్యాస, ఓం క్రీం నయాపైస నీకోస మీదాసు డాయాసముం సైచి ఆఫీసు ముంగిళ్లలం వేచి, చేజాచి వీక్షించి హర్షించుచున్ గ్రక్కునన్ వీటి కేతెంచి కీర్తించి నిన్ గాంచి మోదంబు నందంగ, నాబాలగోపాలమున్ లీల లాలించ నేతెంచు నోచిద్విలాసా, నయాపైస, ఓ హేమలంబాదిభాసా, దశాంశాది రూపప్రకాశా, సమర్పింతు నీ వచ్చు వేళన్ నమోవాక్కు లెన్నేనియున్!

ఈ రేడు లోకాల నీకీడు జూడంగగా లేదు, నాయుండ నీవుండ నా కుచేగుండు సైతంబు దాసానుదాసుండుగా నుండడే, దండముల్ పెట్టడే, నీదు తోబుట్టు కంటన్నడ న్వెంట నే పంచ బంగారికై భీతి మై పాఱదే, శూన్యమై పోవదే, ఘల్లుఘల్లంచు గర్జించగానే శివంబుల్ వికాసాకృతిన్ లేవదే, కూడికల్ తోపుడుల్ పెంచుటల్ భాగహారాది సౌలభ్యసంధాయినీ, కష్ట నిర్మూలినీ, దుఃఖసంహారిణీ, లోభిమూకావళీ చిత్తసంచారిణీ, పద్మినీ రాగిణీ, మోహినీవార నారీమణీ చిత్తసమ్మోహినీ, విశ్వసంభావనీ, పావనీ, నీదువర్ణంబు తామ్రంబు రూపంబు రమ్యంబు, నామంబు దివ్యంబు, నీయాగమంబున్ ధహాస్యంబు, గమ్యంబు వేగంబు, మాయంబు మర్మంబు వ్యాప్తంబు సర్వంబు, లభ్యంబు వార్షంబు, జన్యంబు కోశంబు, చిత్తంబు చాంచల్య తత్త్వంబు, క్రీడాభిరామంబు మాదివ్య ఖండంబు, శూన్యంబు వంత్యంబు నిన్ గూర్చు యంత్రంబు తంత్రంబు, నీ ప్రీతి మంత్రంబు మోపంబు గాదే!

కాంగ్రెస్ప్రభుత్వంబు గర్భంబునం దుద్భవంబంది, పెంపొందు రాజేంద్ర ప్రాసాద రాజర్షి సద్గోత్ర సంజాత, నెహ్రూ మహాపండితారాధ్యలీలా వినోదార్ధ సంభూత, సర్వప్రజానీక సంస్తుత్య విఖ్యాత, సత్కార్య దుష్కార్య మీ దేర్చు నిష్పక్షపాతా, భవద్దివ్యభాగ్యంబు నందంగ నెంతేసి కృత్యాలు సేయంగగా లేదె నీభక్తవర్గంబు నీవన్యులం జేరి దాస్యంబు సేయంగ సైరింపగా లేక నీదాస్యమై ముక్తి నీవశ్యమవశ్యకర్తవ్యమంచున్ మదిన్నెంచి శూనీల నెన్నేనియుం జేయగా లేదె మంత్రుల్ కలక్టర్లనుంగాంచ మున్ముందు దాక్షిణ్యభావంబు కాంక్షించుదౌవారి కాచిత్త సంప్రీతి సంధాయి, నీదు ప్రసాదంబు ఎమ్. ఎల్. ఎ. పట్టంబునందన్ నిమిత్తంబు, లంచాల మారీలు నీమీది మోహంబు బాయంగగా లేక చేజాచి జోబీలలో పైచి దుర్మార్గులన్ బ్రోచి సన్మార్గులన్ హింసలన్ బెట్టుటల్ నీ ప్రతాపంబు గాదే, మహాసత్య వింద్రుండు భోజక్షితీంద్రాది పూజ్యుండునా కాళిదాసున్ బలింగొన్న చండప్రతాపా వినూత్న స్వరూపా, గవర్నమెంటు పట్టీలయందున్న కాకారు గామారి కాఫీ లహోటళ్లయోనర్లు పూజింప తత్పుత్రుముంబూని సప్తర్షి సంఖ్యావతారంబుగా నొప్పు కామస్వరూపీ, ప్రపన్నంబు కావమ్మ, రావమ్మ, మమ్మేల నీకేల జాగేల నీవేళ రావేల నేనీదు భక్తుండ శిష్యుండ, ముల్లోక వశ్యంబుకున్ మూలమైయుండ నీ శక్తి వర్ణింప నేనెంత, నీవేడ నేనేడ, నీరూప మండాండ బ్రహ్మాండమున్ నిండియుండన్నినున్ భక్తి పూజించు దీనాతి దీనుండ నీపాదదాసుండ, నీకీర్తి సంప్రీతిగా ప్రస్తుతింపంగ లేనట్టి బాలుండ, బ్రోవంగదే, కొట్నవంశాన్వయాంభోధి జన్ముండ, వేమయ్య పుత్రుండ మద్రాసు వాస్తవ్య డార్యప్రియుండన్ కటాక్షింపరావే ముదంబొప్పనిన్ గొల్చు నన్నావరావే నమస్తే నమస్తే నమః.

# సాక్షి

మూలం: "మాన్పూర్"

అనువాదం: మధురాంతకం రాజారాం

కాలు గాలిన పిల్లిలా కోర్టుముందు వేపచెట్టు క్రింద తిరుగుతున్నాడు శేఖరం. గంట పదకొండు కావస్తోంది. వకీళ్ళందరూ వచ్చేస్తున్నారు. మునసబుగారు కూడా కారులో వచ్చేశారు. కానీ ఏ ప్రమాదం అడ్డుతగిలిందో, తన సాక్షులు మాత్రం యింకా రాలేదు!

సాక్షులు రాకపోతే వాయిదా కోరడం కన్నా గత్యంతర మేముంది? శేఖరం తన వకీలు సూర్యనారాయణ దగ్గరికి వెళ్ళి "వాయిదా కోర్పించండి. సాక్షులెవ్వరూ రాలేదు" అన్నాడు.

వకీలు సూర్యనారాయణ లోపలికి వెళ్ళి మునసబుగారితో మాట్లాడివచ్చి, "అబ్బే, కథ అడ్డం తిరిగింది శేఖరం! మునసబుగారు మన సాక్షులు రాకపోతే, ఈ కేసులో ఎదుటి వాళ్లకు సులువుగా తీర్పు జరిగి పోతుందంటున్నారు" అన్నాడు.

"అయ్యయ్యో! ఇప్పుడేం చేయాలండీ?" అంటూ చేతులు నలుపుకున్నాడు శేఖరం!

వకీలు సూర్యనారాయణ ఒకసారి తేలిగ్గా నవ్వి, "ఇంతమాత్రానికే కంగారు పడిపోతే ఎలాగయ్యా శేఖరం! డబ్బిస్తే సాక్షులకేనా కొదవ? నిమిషాలమీద దొరుకుతారు," అంటూ వరండాలోకి వెళ్ళి ఎలుగెత్తి, "జోగిపంతులూ, జోగిపంతులూ", అని పిలిచాడు.

వేపచెట్టు క్రింద పడుకుని అటు నిద్రా, యిటు మెలకువా గాని స్థితిలో జోగుతున్న జోగిపంతులు ఉలికిపడి లేచి, పరుగు పరుగున వరండాలోకి వచ్చాడు.

"ఇదిగో జోగిపంతులూ! నువ్వు శేఖరం తరపున సాక్ష్యం చెప్పాలి" అన్నాడు వకీలు సూర్యనారాయణ.

"దానికేం భాగ్యమండి! నా మామూలు నాకు గిట్టుబాటయితే ఎవరికైనా సాక్ష్యం చెబుతాను." అన్నాడు జోగిపంతులు.

శేఖరం మారు మాటాడకుండా ఓ అయిదు ఇదికూడా దొంగసాక్ష్యమని నిరూపించ గలిగితే, మళ్ళీ ఒకసారి ఇతడు జైలుకు వెళ్ళరాక తప్పదు. జోగిపంతులు ముఖంలోకి ఒకసారి తీక్షణంగా చూచి, అడ్వొకేటు రామారావుగారు తలపంకించాడు.

కానీ అదృష్టవశాత్తు జోగిపంతులకు అను కూలంగా కోర్టులో ఒక సంఘటన జరిగింది. మునసబుగారు హెడ్‌క్లర్కును దగ్గరికి పిలిచి ఈ కేసునుగురించి సంగ్రహంగా మూడు ముక్కల్లో చెప్పేయమన్నారు. హెడ్ క్లర్కు మాటల్ని జోగిపంతులు చెవి ఒగ్గి ఆలకించాడు. అప్పుతీసుకున్న రంగనాథం గారు చనిపోయారు. అప్పు లెక్క పైసలతో చెల్లించమని అయాం [illegible] శేఖరం పేరిట వాది రంగనాథయ్య కొడుకు దావా దాఖలు చేయించాడు. జోగిపంతులకింత రూపాయలనోటు తీసి, జోగిపంతులు చేతిలో వుంచాడు. నిష్కారణ ముఖంతో జోగిపంతులు నోటును పరిగ్రహించి జేబులో వుంచుకున్నాడు.

ఇంతలో కోర్టులోనుండి పిలుపువచ్చింది. జోగిపంతులు గబగబాలోపలికి వెళ్ళి సరుగా బోనులో నిలబడ్డాడు.

అవసరానికి ఆదుకుంటున్న ఈ సాక్షి ప్రవర్తన చూస్తుంటే, శేఖరానికి మతి పోతోంది. ఇతడికి అప్పుతీసుకున్న దెవరో తెలియదు. అప్పు ఇచ్చిందెవరో అంతకన్నా తెలియదు. అసలిది ఎలాటి వ్యవహార మో అది తెలియదు. మరి ఇతడు సాక్ష్యం ఎలా చెప్ప గలడు?

జోగిపంతుల్ని చూడగానే ఇతడుకూలికి సాక్ష్యం చెప్పడానికి కుదిరిన మనిషి అని వాదితరఫు వకీలు రామారావు గారికి తెలిసి పోయింది. ఇంతకుమును ఒకసారి ఇదే జోగిపంతులు దొంగసాక్ష్యం చెప్పి రెండు నెలలు కటకటాల్లోవుండి వచ్చాడు. ముప్ప తిప్పలు పెట్టి, మూడు చెరువుల నీళ్ళు త్రాగించి మాత్రం అవగతమైంది. అప్పుతీసుకున్న అసలుమనిషి రంగనాథం గారు ఎంత పొడుగో, ఎంతలావో, వయసు ఎంతో చెప్పేవరకు అతడికి అంతుచిక్కకముందే, అడ్వొకేటు రామారావుగారువిచారణ ప్రారంభించేశారు.

"ఏమండి జోగిపంతులుగారూ! మీ రెప్ప టివరకు ఎప్పుడైనా జైల్లోవుండి వచ్చారా?"

ఈ ప్రశ్నవల్ల జోగిపంతులు తల్లక్రిందులై కంగారుపడిపోగలరని రామారావుగారు అను కున్నారు. కానీ జోగిపంతులు మాత్రం ఒక క్షణం నెకప్పు కేసి చూసి, ఆ తరువాత ఎడమ చేతిని పైకెత్తి వేళ్ళను లెక్కపెట్టుకుంటూ "ఆమాటకొస్తే ఈ పద్నాల్గు జైలుకు వెళ్ళిరాని శేఖరుడెవరండీ?" అన్నాడు.

"ఓహోహో! ఐతే మీరు కటకటాల్లో వుండి వచ్చింది ఏ ఉద్యమంలో పాల్గొన్నం దుకో చెబుతారా, జోగిపంతులుగారూ!" రామారావుగారు అతివినయంగా ప్రశ్నించారు.

"మీకు తెలియందేముంది! నాపనల్లం ఘనమేకదా మన ఉద్యమం!"

# ★ సాక్షి ★

"రామారావుగారు పక్కన నవ్వుతూ "మీ రాశాసనాన్ని ఉల్లంఘించాగో అది కూడా చెప్పాలిగదండీ! నాకు తెలుసునను కోండి! కానీ కోర్టువారికోసమైనా మీరు కాస్త శ్రమదీసుకోక తప్పదు."

"ఎంతమాట! మీరడగాలేగానీ నేను బదులుచెప్పడం ఒక శ్రమటండీ? గాంధీగారు ఉప్పుచట్టాన్ని ధిక్కరించారా! ఆయన అనుచరులు అటవీశాసనాన్ని అతిక్రమించారా! అలాగే నేనూ సాక్షిచట్టాన్ని ఉల్లంఘించాను."

అడ్వొకేటుగారు మునసబుగారివైపు తిరిగి "ఇతడింతకుముందొకసారి అబద్ధపుసాక్ష్యం చెప్పి జైలులోవుండి వచ్చాడండీ! కానీ ఆ యథార్థాని కిప్పుడు ముసుగు వేసి మాకేమో గాయం చేస్తున్నాడు."

"అలాగయితే, ఆ కేసు తాలూకు తీర్పును మీరిప్పుడు దాఖలుచేసివుండవచ్చునే! పోనీ ఉపోద్ఘాతం ముగించి సరాసరి కేసులోకి దిగండి" అన్నారు మునసబుగారు.

అడ్వొకేటు రామారావుగారు మళ్లీ ప్రారంభించారు.

"జోగిపంతులుగారూ! చనిపోయిన రంగనాథంగారు తెలుసునా మీకు?"

"తెలియడమేమిటి బాబూ, ప్రాణస్నేహితులమైతేనూ! తనువులు వేరైనా మా మనసులొకటేగదండీ! ఒక కంచంలో తిని ఒక మంచంలో పడుకున్నవాళ్లం!"

"ఆయన వయస్సు?"

"వయస్సా? వయసుమాటకేంగానీ, ఆయన మంచి నడిప్రాయం మనిషండీ!"

"ఇదేం జవాబు జోగిపంతులుగారూ! సరిగ్గా చెప్పండి. ఆయన వృద్ధుడా? పడుచువాడా?"

జోగిపంతులు తడువుకోకుండా సమాధానం చెప్పసాగాడు. "ఏళ్ళను బట్టి చూస్తే, ఆయన్ని మరీ ముసలివాడని చెప్పడానికి వీలు గాదండీ! కానీ వట్టి అనారోగ్యపు మనిషి. లేనిపోని జబ్బులన్నీ ఒక్కుమ్మడిగా చేరుకుని, ఆయన్ని పీల్చి పిప్పిచేశాయి. అందువల్ల కాస్త వయసు మళ్లిన మనిషిలాగానే కనిపించేవాడు."

రామారావుగారు ఒక నిమిషం ఆలోచించి "ఈ ప్రశ్నకు సూటిగా జవాబివ్వండి. ఆయన తలవెంట్రుకలు నెరసిపోయాయి గదూ!" అన్నారు.

"అవి తెల్లబడ్డమాట వాస్తవమేనండీ! కానీ వాటికి రంగు వేసుకోడం రంగనాథంగారి అలవాటు.

"రంగనాథంగారి శరీరచ్ఛాయ ఎలా వుండేదో చెప్పగలరా!"

"తెల్ల తామరపువ్వులాంటి దేహచ్ఛాయ గదండీ ఆయనది! ఐతే ఒకటి! మాటిమాటికీ జ్వరాలు అవీ రావడంవల్ల ఆయన ఒళ్ళు అప్పుడప్పుడూ నలుపెక్కి వుండేదికూడా!"

"ఆయన పొడుగ్గా వుండేవాడా? లేక పొట్టిమనిషా?"

"మనిషేమో స్వతస్సిద్ధంగా పొడుగరేనండీ! కానీ గూనివల్ల పొట్టిగా కనిపించేవాడు."

రామరావుగారు పట్టరాని కోపాన్ని పైకి కనబడనీయకుండా, "ఇదంతా ఏమిటి జోగిపంతులూ! పక్కా పసిపిల్లల వ్యవహారంలా వుంది! మనిషి పొడుగూ అంటూనే పొట్టి అని, తెలుపుగానే కాదు, నలుపుగాకూడా వుండేవాడనీ అతుకందక, పొంతనపొందక జవాబులిస్తే మేమేమనుకోవాలి?" అన్నారు.

"తమరు వృథాగా కోపం చేసుకుంటే నేనేం చెప్పగలను. బాబూ! మా పరిచయమేం ఒకనాటిదా! సంవత్సరాల తరబడీ రాత్రింబగళ్లూ మేము కలసి మెలసి మెలగినవాళ్లం. అందువల్లనే ఆయన ఎప్పుడెప్పుడు ఎలా వుండేవాడో చెప్పగలుగుతున్నాను" అన్నాడు జోగిపంతులు.

రామారావుగారీసారి మరీ తీక్ష్ణంగా ఆలోచించి కళ్ళజోడు సవరించుకుంటూ, "రంగనాథంగారికి గడ్డం వుండేదా?" అన్నారు.

"గడ్డమా అండీ! రంగనాథంగారిదో తరహాలెండి! ఒక బుద్ధిపుడితే బౌద్ధభిక్షువులా శుభ్రంగా శిరోముండనం చేయించుకునేవాడు. ఇక బుద్ధిమారితే, బైరాగిలా పెద్దగడ్డం పెంచేసేవాడు"

"రామ రామ ప్రాణం తీస్తున్నావయ్యా బాబూ! అడిగే ప్రశ్నకు అవును, కాదు అనకుండా ఈ చచ్చు సమాధానాలేమిటి?"

"ఇకమీదట అలాగే చెబుతానండీ", అంటూ జోగిపంతులు సత్యానికి యీ లోకంలో తావు లేనందుకు చింతిస్తున్నట్లు ఏడుపుముఖం పెట్టాడు.

"రంగనాథంగారి నివాస మెక్కడ?"

తక్షణం సమాధాన మిచ్చాడు జోగిపంతులు: "ఆయన యింట్లోనేనండీ!"

"అయ్యో భగవంతుడా! ఏం బుద్ధిమంతుడివయ్యా నువ్వు! ఆయన నివాసం పట్టణంలోనా, గ్రామంలోనా అని నా ప్రశ్న?"

"ఓహో అదా బాబూ! ఆయన అక్కడా ఇక్కడా కూడా వుండేవాడు. తలచుకుంటే పట్నంలోవుండీ, వెంటనే గ్రామానికి వెళ్ళిపోయేవాడు."

"పల్లెలో ఆయన ఇంటిద్వారం ఏదిక్కున వుండేదో చెప్పగలరా! మీరు పలుమారు అక్కడికి వెళ్ళివుంటారనుకుంటాను."

"ఆహా, ఎన్నోసార్లు వెళ్ళానండీ,"

"నా ప్రశ్నకిది సమాధానం కాదు."

"ఇంటి కడపవిషయం కదండీ! పట్టణం నుంచీ గ్రామాలకు వెళ్ళినప్పుడు దిక్కులు దొచకపోవడం సహజమేకదండీ! సరిగ్గా చెప్పడం కష్టం."

రామారావుగారు సాక్షిని చురచుర మాచి "సరే ఆయన ఎందుకోసం అప్పుచేశారో తెలుసా మీకు?" అన్నారు.

"డబ్బుతో అవసరంకలిగేనండీ!"

"అదే, ఆ అవసరమేమిటనే అడుగుతున్నాను."

"రంగనాథంగారి స్వభావం చాలా చిత్రంగా వుంటుంది బాబూ! ఆయనకు డబ్బు అవసరం, అనవసరం అంటూ ఉండేదు. సర్వదా తనకందుబాటులో వెయ్యి, రెండువేలు వుంటేగానీ ఆయనకు నిద్రపట్టేది గాదండీ!"

"ఆయన శరభయ్యగారి దగర అప్పు తీసుకున్న దెప్పుడో చెప్పండి మరి."

"ఇదేం ప్రశ్న! అవసరం కలిగినప్పుడే గదండీ అప్పుకోసం ప్రాకులాట!"

"అప్పుచేసి ఎన్నిరోజులై వుంటుంది?"

"ఏడాదికి మూడువందల అరవయిం చిల్లర రోజులు గదండి! లెక్క గట్టడం కష్టం".

"ఆ లెక్క గట్టమని ఎవరన్నారు? ఎన్నేళ్ళయి వుంటుందో చెప్పకూడదూ!"

"ఆ విషయం దస్తావేజులోనే వుంటుంది గదండీ!"

"అలారండి దారికి! ఈ డొంకతిరుగుళ్ళు పోకపోతే ఈ అప్పు సంగతి నాకు తెలియదని యథార్థం ఒప్పుకోవచ్చునే!"

"వానాకాలపు చదువులు గదండీ! ఆ కాలమానం కాస్త మరచి పోయినట్లున్నాను.!

"నీ కాలమానం ఎవడికి కావాలయ్యా! ఆయన అప్పుతీసికొన్న దెప్పుడో చెప్పలేవూ"

"ఎందుకు చెప్పలేను! రంగనాథంగారు తమ జీవితకాలంలోనే ఈ అప్పుచేశాడు."

సాక్ష్యం చెబుతున్న జోగిపంతులకు ఈ వ్యవహారాన్ని గురించి ఏమీ తెలియదని రామారావుగారికి అవగతమైంది. కాని వీడి

అసాధ్యంగూలా! కానీ ఎంతగా తర్కించినా యితడు తనకేమీ తెలియదని నిజం ఒప్పుకోవడం లేదు. ఇప్పుడేం చేయాలి? రామారావుగారి బుర్రలో ఒక ఆలోచన తళుక్కున మెరసింది.

"ఇదిగో జోగిపంతులు గారూ! మీకూ రంగనాథం గారికీ చిరకాల స్నేహితంగదా! ఆయన దస్తూరీ మీరిస్తే గ్రహించగలరను కుంటాను."

"అదెలా సాధ్యమౌతుందండీ! ఆయన ఒకసారి వ్రాసినట్టు మరోసారి వ్రాస్తేగదా! కావాలంటే ముత్యాల కోవలా వ్రాసేవాడు; పాలుమారితే, పసిపిల్లాడిలా గిలికి పారేసేవాడు. అసలు అన్ని విధాలుగా రాయగలగడం ఒక గొప్పకళ అని చెబుతూ ఆయన గర్వించేవాడండీ."

ఈ జవాబుతో రామారావుగారు ఆశ నిర్హాశ చేసుకుని తమ ఓటమిని ఒప్పుకోవలసి వచ్చింది. మునసబుగారు మందహాసంతో, "ఇంతేనా! ఇంకా అడగవలసిం దేమైనా వుందా?" అన్నారు.

"ఇంకేమీ లేదండి!" అంటూ రామారావుగారు నిరుత్సాహంతో బదులు చెప్పి, అంతలోనే మరొకవిషయం జ్ఞప్తికి రాగా: "ఒక్క ప్రశ్నమాత్రం బాకీ వుందండీ! ఇంతటితో ఈ క్రాసుపరీక్ష ఆపుతుంటాను" అన్నారు. దస్తావేజులో ఒకచోట రంగనాథంగారి మరణాన్ని గురించి ఉదహరింపబడి వుంది. ఈ సంగతిని మనసులో వుంచుకుని అడ్వొకేటుగారు చివరిప్రశ్న నిలా సంధించారు.

"జోగి పంతులుగారూ! మీ స్నేహితుడు ఏ వ్యాధివల్ల చనిపోయాడో చెబుతారా?"

జోగిపంతులు ముఖమండలంలో విచార మేఘాలు క్రమ్ముకున్నాయి. అతడి కంఠం గద్గదికమైపోయింది. "అయ్యో, ఆ దురవస్థ నేమని చెప్పనండీ! అప్పటికీ చికిత్స చేయించడంలో కించిత్తు లోపమయినా జరగనివ్వ లేదే! యునానీ, ఆయుర్వేదం, అలోపతీ, మంత్ర తంత్రాలన్నీ జరిగాయి. కానీ ఈ వైద్యప్రక్రియలన్నీ ఆరోగంధగ్గర భలాదూరై పోయాయి. వైద్యులుమాత్రం ఏం చేయగలరండు పాపం! వాళ్లు మందయితే ఇవ్వగలరు గానీ ప్రాణం పోయలేరుగదా!"

గంట నాలుగయింది. కోర్టువేళ మీరిపోతోంది. మునసబుగారు మరొకనాటికి కేసు వాయిదా వేశేశారు.

గంభీరమైన ముఖభంగిమతో బోనులో నుంచి క్రిందికి దిగుతున్న జోగిపంతుల్ని చూచిన వాళ్ళందరూ, ఆ రాచరీవికి అబ్బురపడకుండా వుండలేకపోయారు. ★



"నీ వాలం నా గాలం!"

చిత్రకారుడు : పిళ్లాసుబ్బారావుశాస్త్రి.

# అసంప్రేక్ష్యకారిత్వము... పంచతంత్రము ...అయిదవ భాగము


















గేయరచన
నండూరి. రామమోహనరావు    బొమ్మలు బాపు















# కలిసిన హృదయాలు

వి. కామేశ్వరి

అర్థరాత్రి రెండుగంటలయింది. విశాఖ పట్నంనుండి బయలుదేరిన జనతా ఆగకుండా పరుగెడుతూవుంది. తనతో సమానంగా పరుగులు తీస్తున్న చెట్లని, టెలిగ్రాఫ్ స్తంభాలను చూస్తూ కిటికీ దగ్గఱగా కూర్చున్నాడు ఆ అబ్బాయి. ఏమిటో చాలా దీర్ఘంగా ఆలోచిస్తున్నాడు. మధ్య మధ్య తనలో తనే ముసిముసిగా నవ్వుకుంటున్నాడు. బహుశా తను చూడబోయే, అనుకూలమయితే తనకు కాబోయే వధువు జ్ఞాపకంవచ్చినట్లుంది. ఆ బ్బా యి ఆలోచనకి అంతరాయం కలిగింది.

ఒక అమ్మాయి ఆ పెట్టెలోకే ఎక్కింది కాబోలు, ఎక్కడా చోటుదొరక్క అబ్బాయి సీటు దగ్గరకి వచ్చింది. అక్కడ కూడ జనం బాగానే వున్నారు. అమ్మాయి అలాగే నిల్చుంది. ఎవరన్నా పిలిచి చోటు చూపిస్తారేమోనని. నిల్చున్న అమ్మాయి చాలా బాగుంది.

లేత వైలెట్ సిల్కుచీర, ఒంటికి పట్టిన తెల్ల క్రేప్‌జాకెట్టు అమ్మాయి నాజూకుతనాన్ని చూపిస్తున్నాయి. మెళ్ళో వేసుకున్న తెల్లరాళ్ల మామిడిపిందెల నెక్లెసు వుండివుండి నక్షత్రంలా మెరుస్తూంది. చేతిలో ప్లాస్టిక్ బాగ్. వాచ్. వాలకమంతా చదువుకున్న దానిలావుంది. ఎంత బాగుంది... చూడకూడదనుకుని చటుక్కున చూశాడు అబ్బాయి. అమ్మాయికూడా చూచింది. ఉక్కిరిబిక్కిరయ్యాడు...పాపం!

ఇక అబ్బాయి. తెల్లపాంటు, తెల్ల బుష్ కోటు వేసుకున్నాడు. కాళ్ళకి బూట్సువున్నాయి — కళ్ళకి జోడుమాత్రం లేదు. వేషం చూస్తే బాగా చదువుకున్న వాడిలా మర్యాదస్తుడులా కన్పించాడు. అమ్మాయి మనస్సులోని ఉద్దేశం తెలుసుకున్నాడు కాబోలు, కొంచెం ప్రక్కకి జరిగి—

'అభ్యంతరం లేకపోతే యిక్కడ కూర్చోవచ్చు' అన్నాడు మెల్లిగా. ఆ మాటకోసం ఎదురుచూసిన అమ్మాయి మాట్లాడకుండా ఒదిగి కూర్చుంది. ఇద్దరికి మధ్య ఎందుకయినా మంచిదని తన బాగ్ అడ్డంపెట్టాడు అబ్బాయి. అతని ఆటగోడుతనానికి నవ్వుకుంది. ఎవరూ మాట్లాడడంలేదు.

పావుగంట గడిచింది. మంచివాడనుకున్న అబ్బాయి కొంటెగా ప్రక్కచూపులు ప్రారంభించాడు. మొదట్లో తను చలించలేదు. నిముషాలు గడిచినా చూపులు మారటంలేదు. అబ్బాయిమీద కోపం వచ్చింది. "ఎందుకలా చూస్తాడు? తనకి ఎవరయినా చూస్తుంటే చచ్చేటంత సిగ్గు. అందులోనూ చెట్టంత మనిషి, నలుగురులోనూ రెప్పార్పకుండా, గుడ్లు తిప్పకుండా అదే పనిగా చూడడం ప్రారంభిస్తే, ఏం చెయ్యాలి? చుట్టూకూర్చున్న ప్రయాణీకులు ఏమనుకుంటారు. ఒకరు చూస్తారన్న భయమేలేదు కాబోలు" అనుకుంది అమ్మాయి. అబ్బాయి చూపులు తప్పించుకుందుకు హాండ్‌బాక్ అడ్డం పెట్టుకుంది. సన్నగా నవ్వుకున్నాడు.

'ఎందుకంత సిగ్గు. చదువుకున్న అమ్మాయికి సిగ్గు సహజమా? ప్రబంధనాయకిలా సిగ్గుపడుతూంది. వంటరిగా ఎక్కడనుంచి వస్తోందో! ఎంత బాగుంది ఆ అమ్మాయి. అమ్మాయికన్న అందంగా వున్నాయి ఆమె కళ్లు. ఆడపిల్లల అందం అంతా కళ్లలోనే వుందంటాడు కవి. బాగా కనిపెట్టినట్లున్నాడు. కళ్ళు బాగానే అందంగా వున్నాయిగా. యింకా ఎందుకలా అడ్డుపెట్టుకుంది. అందమైన తన కళ్ళు ఎవరూ చూచి ఆనందించకూడదు కాబోలు. తను కలుసుకోబోయే వధువుపరీక్ష ముందఱ కళ్లలోనే చెయ్యాలి' అనుకున్నాడు.

"నాన్నగారు స్టేషనుకి వస్తే బాగుండును. అర్ధరాత్రి వేళ యింటికి ఒంటరిగా వెళ్ళడం బాగుండదు" అనుకుంది.

"పిల్లవాడు బుద్ధిమంతుడు, డాక్టరువృత్తి చేస్తున్నాడు. ఒడ్డూ పొడుగూ వున్నాడు, అందంగా వున్నాడు, కట్నం కానుకలతో నిమిత్తం లేదు. రేపు రాత్రికి వస్తున్నాడు కాబట్టె నువ్వుకూడా వస్తే బాగుంటుంది." అని తండ్రి వ్రాసిన ఉత్తరం అందుకుని బయలుదేరింది తను. పిల్లవాడు విశాఖనుండి వస్తాడని తెలుసు. మరి యీ అబ్బాయో! అక్కడనుండే లాగుంది రావటం. దూరప్రయాణం చేసి వస్తున్నవాడులా వున్నాడు. డాక్టరు కాదేమో! ఎవరని అడగడం? జేబులో థర్మామీటర్ గాని మెళ్ళో

## చెవిటి వారి లోకం

చెవిటివాడు: ఎందుకలా అరుస్తారు! నాకేం చెముడనుకొన్నారా?

ఒకడు: అబ్బే! నేనిప్పుడు అరవలేదు. ఆవలించాను. అంతే!

* * *

భార్య: నా ముక్కుపుడక కాస్తా ఎక్కడో పోయిందండీ.

చెవిటి భర్త: అసలు నా ముక్కుపొడి డబ్బాతో నీకేమి పనొచ్చింది?

ఎల్. వెంకటేశ్వర్లు.

---

స్టెత స్కోప్ గాని లేదు. అతను డాక్టరని ఎలా అనుకోవడం. ఆ అబ్బాయి ఎవరో? నాన్నగారు వ్రాసిన డాక్టరు, యీ అబ్బాయి అయితే ఎంత బాగుండును! అని అనుకుంది అమ్మాయి. సిగ్గుతో కళ్ళు కిలకిలా నవ్వాయి.

"ఆ అమ్మాయి రాజమండ్రిలో బి. ఎ. చదువుతూ వుంది. మనిషి సన్నగా, పొడుగ్గా, అందంగా వుంటుందిట. బాగా పాడుతుందట కూడాను. ఇంతవరకు ఒక్క మాటగూడా వినిపించలేదు పోనీ మాటను బట్టి పాటను వూహించవచ్చుననుకుంటే. శాస్త్రి అన్న పిల్ల యీమే అనుకుందికి ఆస్కారం లేదు, ఒక్కటి తప్ప. ఏమంటే యీ అమ్మాయి కూడ రాజమండ్రిలోనే ఎక్కింది. కాబట్టి, అక్కడే చదువుతోంది. కాని యీ అమ్మాయే పెళ్ళికూతురని ఎలా అనుకోవడం. చూపులకోసమని తను ఏలూరు వెళుతున్నాడు. తీరా చూస్తే ఎలా వుంటుందో! యీ అమ్మాయిలా వుంటే ఏదో ఫరవాలేదు. తనే అయితే అంతకన్నా అదృష్టం వేరేముంటుంది. ఏమయినా వాళ్ళు వీళ్ళెందుకవుతారు! తన పిచ్చి కాని! అంతదాకా వస్తే ఆ పిల్ల తను అనుకున్నది కానిపక్షంలో నచ్చలేదని నిరాకరించవచ్చు! నిర్ధారణ చేసుకున్నాడు. అబ్బాయి తెగించి మళ్ళీ చూశాడు అమ్మాయిని. జేర్ చేసి బాగ్ సందులోంచి చూచింది అబ్బాయిని. స్టేషను వచ్చింది కాబోలు రైలుకి బ్రేకుపడింది. ఏలూర్...ఏలూర్ అరుపులు వినబడ్డాయి. ఇద్దరూ లేచి నిలబడ్డారు. "పెళ్ళయిందా!" ఎదురుగా కూర్చుని అంతసేపూ కునికిపాట్లు పడుతున్న ముసలమ్మ హఠాత్తుగా అడిగింది. 'ఊ! హూ!' సిగ్గుతో తల వూపింది. అబ్బాయికి కావలసిన యిన్ఫర్మేషన్ దొరికింది. ముసలమ్మకి మనస్సులోనే థాంక్స్ చెప్పుకున్నాడు. ఒకరివెనుక ఒకరు దిగడం జరిగింది.

'అమ్మా! శ్యామా!...' ప్లాటుఫారం మీద నుండి ఎవరో పిలిచారు.

'వస్తున్నా నాన్నగారూ! ఇక్కడ వున్నాను.' పెట్టెలోనుండి చెయ్యి చూపించింది అమ్మాయి. సామాను దింపుకుంటున్న అబ్బాయి, అమ్మాయి పెట్టెకూడా దింపి క్రిందపెట్టాడు. అతని పరధ్యానానికి నవ్వుకుంది శ్యామ.

'ఆ పెట్టె నాది ... యివ్వండి ...' ముద్దుగా అడిగింది. ఆమె మాటలకోసం చెవులు నిగిడించుకున్న అబ్బాయి చాలా సంతోషించి 'నే దింపుతా...పదండి.' అన్నాడు కలిగిన అవకాశం జారవిడుచుకోకుండా. శ్యామ మెల్లిగా ఒక్కొక్కరినే తప్పించుకుని తలుపుదగ్గఱికి వచ్చింది.

'జాగ్రత్తగా వచ్చావా?' అడిగారు ముసిలాయన.

'వచ్చా నాన్నగారు...' సిగ్గుపడుతూ అబ్బాయిచేతిలో పెట్టె అందుకుంది శ్యామ. మిగిలిన సామాను జేరవేస్తున్న అబ్బాయికి వెనుకనుండి పిలుపు వినబడింది.

'హల్లో! శాస్త్రీ! వచ్చావేం? రావనుకున్నా!' పలకరించాడు అబ్బాయి. శాస్త్రి చూడనట్లు నటించాడు.

'ఇలా వచ్చారేం పంతులుగారూ!' అప్పుడే వెళ్ళబోతున్న శ్యామతండ్రిని భుజం పట్టుకుని పలకరించాడు శాస్త్రి. ఉలిక్కిపడ్డారు పంతులుగారు.

'ఓ! శాస్త్రి! నువ్వా వచ్చావేం?' ఎదురుప్రశ్న వేశారు. 'మావాడు వచ్చాడు. మీకు చెప్పానుగా. అందుకని.' నవ్వాడు. శ్యామవైపు ప్రశ్నార్థకంగా చూశాడు! సామానుతోసహా క్రిందకి వచ్చాడు అబ్బాయి.

'మా అమ్మాయి. శ్యామ, యిప్పుడే దిగింది.' పరిచయంచేశారు. తనలో తనే నవ్వుకున్నాడు శాస్త్రి.

"మా ఫ్రెండు రమేశ్. విశాఖలో డాక్టర్." రైలుదిగిన అబ్బాయిని శ్యామకి, తండ్రికి పరిచయంచేశాడు శాస్త్రి. శ్యామ ఉక్కిరి బిక్కిరి అయింది. అబ్బాయి చలించలేదు.

'చాలా సంతోషం. మా అమ్మాయి యిది. శ్యామ. రాజమండ్రిలో చదువుతూ వుంది మీకీ పాటికి తెలిసే వుంటుంది." అన్నారు ఛలోక్తిగా ముసిలాయన. ఆడబోయిన తీర్థం ఎదురయింది అబ్బాయికి.

'బాగా తెలిసింది.' చిరునవ్వు నవ్వాడు.

"నేషను వచ్చేసింది. కలియవలసిన పట్టాలు ఎప్పుడో కలిసిపోయాయి. ఇక ముహూర్తం పెట్టడమేనా తరువాయి." అడిగాడు శాస్త్రి. అందరూ నవ్వుకున్నారు.

'ఇంటికి వెళ్ళి తీరికగా మాట్లాడుకోవచ్చు. ఇక పోదాం!' పంతులుగారు అన్నారు.

'ఏంరా బ్రదర్. చూసింది చాలునా లేక పెళ్ళి చూపులని వేరే ఏర్పాటు చేయించాలా!' గమ్మత్తుగా అడిగాడు శాస్త్రి. రమేశ్ చిరునవ్వుతో చాలదన్నట్లు చూశాడు శ్యామవైపు. కాబోయే పెళ్ళికూతురికి సిగ్గేసి, అంతవరకు కలిసిలేని పట్టాలవైపు దృష్టి మరల్చింది. ★

---

# మానవ నైజం

[ శెట్టిపల్లి రామకోటీశ్వరరావు ]

తల్లిదండ్రులకన్న
ఆప్తమిత్రులకన్న
చదువుసంధ్యలకన్న
జవరాలి జడలోని
జాజిపూవులు మిన్న.

* * *

కవనరచనముకన్న
కావ్య పఠనముకన్న
దరిజేరనున్న
ధనరాసికన్న
ప్రియురాలి తలలోని
ప్రక్క పిన్నులు మిన్న.

* * *

కన్నవారికి పేరు తెచ్చుటకన్న
ఉన్న ఊరిని పేరు నొందుటకన్న
దేశసేవకు దేహమిచ్చుటకన్న
ప్రేయసీ ప్రేమలో గడుపుటే
మిన్న.

మున్న చిన్న చిరునవ్వు నవ్వేవారు. ఆ నవ్వు సంతోషంతో నవ్వింది కాదని స్పష్టంగా తెలిసిపోతోంది ఆ సంగతి వీరాస్వామిగారు మాత్రం గ్రహించలేదు. ఆయనముఖం మరో వేపు పెట్టుకొని మాటాడుతున్నారు.

"మంచి పని జరిగింది" ఏదో ముంచుకొస్తున్నట్టు అందుకున్నారు పరమేశంగారు. వీరాస్వామిగారు ఓసారి వింతగా పరమేశంగారి ముఖంకేసి 'ఏమిటిది?' అని ప్రశ్నిస్తున్నట్టు చూసి, ముఖంకిందకు దించేసుకున్నారు చెప్పమన్నట్టు.

"అవును, మీరు నాకు తటస్థించడం చాల మంచిదైంది. లేకపోతే తర్వాత విచారించాల్సొచ్చేది" అన్నారు పరమేశంగారు.

"మీరనేదేమిటి?" మరీ ఆశ్చర్యపోతున్నారు వీరాస్వామిగారు.

"ఏమీ అనుకోరు గదా?"

"అదేమిటి తమ్ముడుగారు, నా దగ్గిర సంశయిస్తారేం?"

"ఏమో లెండి!"

"అబ్బే, అలాంటిదేమీ అనుకోకండి"

"అయితే వినండి మీరు తక్షణం బయల్దేరి, బండిదొరుకుతుంది, వెళ్ళిపొండి."

"అంటే?" విపరీతమైన ఆశ్చర్యాన్ని ప్రకటించారు. వీరాస్వామిగారు.

"తక్షణం ప్రయాణంకండి, తర్వాత చెబుతా."

"ఏమిటి యింతలా మాటాడుతున్నారు?

"తర్వాత చెబుతానన్నాగా?"

"అబ్బ, చెప్పండీ బాధించక? ఏమొచ్చింది యింతక్కి?"

"వొచ్చింది కాబట్టే మీ మేలుకోరే వాళ్ళలో నేనొకణ్ణి గనక యిలా చెప్పాల్సొచ్చింది"

"నా కర్థంకావడంలేదు మీ మాటలు?"

"సరే వినండి, మీరు కాదూ, కూడదు, యిప్పుడే తెల్సుకోవాలంటున్నారు గనుక చెబుతున్నాను." అంటూ మొదలెట్టారు పరమేశంగారు "మీరు ఆ సంబంధం గురించి చెప్పాను చూశారూ శంకరయ్య, అతనెవరో తెలుసా? ఆ పిల్లాడి పెత్తల్లి మొగుడు. అంచేత మీకు ఆ కుటుంబం గురించి అంతగా పొగిడి చెప్పుకొచ్చాడు. మీరు వాడి మాటల్లో పడిపోయారు అందుకే మీరు నాకు తటస్థించటం చాల మంచిదైందన్నాను. లేకపోతే మీరు వెళ్ళి సంబంధం స్థిరపర్చుకొనేవారే మనబోంట్లం, మాటిచ్చేమంటే తిరిగిపోలేం అప్పుడు ఎంతేనా విచారపడాల్సొచ్చును నిష్కారణంగా పిలదాని గొంతు కోయాల్సొచ్చును ఇంతకీ విషయమేమిటంటారా, ఆ పిల్లాడికో విధవ అప్ప ఉండేది అది యీ మధ్యనే ఓ కులంలేని వాడితో వుడాయించేసింది అది పోకుండా ముందుగానే మొలాగోలా ఆ కుర్రాడి పెళ్ళికానిచ్చేద్దామని ఎత్తువేశారు. ఈ శంకరయ్యకి కుర్రాడంటే మంచి ప్రేమలెండి. అంచేత అతనే కల్పించుకొని తిరుగుతున్నాడు. వాడికి మీరే దొరికారు. అది కారణం. లేకపోతే యేమీ నా యింట్లో పిల్ల లేదూ? చూస్తూ చూస్తూ పిల్ల గొంతు పిసగ్గలమటండీ. అసలు వాళ్ళ వంశమే అలాంటిదండి" అని తన ధోరణికి ఫుల్‌స్టాప్ పెట్టారు.

"ఆరి పిడుగా!" అనందుకున్నారు వీరాస్వామిగారు. "ఇప్పుడు నాకూ తెలుస్తుందండీ వీళ్ళమోసం. వాడెలా నటించాడో చూశారా? అసలు వాడు పెళ్లి సంబంధానికి రానట్టూ, వేరే ఏదో పనిమీద వచ్చినట్టు, ఆ కుర్రాడిగురించి తనకి తెలిసున్న భోగట్టా చెప్పినట్టూ మాత్రమే ప్రవర్తించాడు. ఎంత మోసం!"

"పోనీలెండి. అయినా, మోసం ఎంత కాలం దాగుతుందండీ?"

"మరేం?"

"సరే, మీకు బండికి టైమైనట్టుంది మరి. ఓరోజు ఉండి పొమ్మందామనుకున్నాను గాని, మళ్లా వాళ్ళంతా వస్తే లేనిపోని తగవులూ, గిరవులూను. ఇవన్నీ ఎవడు పడతాడు? మీరా, తగవులంటే కిట్టనివారు. ఏం చేస్తాం? మరోకప్పుడెప్పుడైనా దయచేద్దురుగాని. ఇలాటి సమయాల్లో మిమ్మల్ని ఆపుచేయడం నాకూ భావ్యంకాదు." ప్రేమంతా వొలకబోసేశారు పరమేశంగారు.

"మరి చూస్తున్నారు కదూ?" అన్నారు వీరాస్వామిగారు.

"నాకు చెప్పాలటండీ" దివ్యదృష్టి దురంధరుడిలా.

"మరి వెళ్ళొస్తా" అంటూ లేచారు వీరాస్వామిగారు.

"చిత్తం. దయమాత్రం వుంచండి. మరోసారి తప్పక దయచెయ్యాలి మా యింటికి" అని, "అమ్మాయ్, పెదనాన్నగారి సంచీ యేదమ్మా" అని కేకేశాడు.

వరలక్ష్మి సంచి తెచ్చి యిచ్చింది. సంచి తీసుకొని, వీథిలోకి కూడావచ్చి సంచి వారి చేతికిచ్చి ఓ వొంకర నమస్కారం పారేసి, ఓ తమాషైన నవ్వు నవ్వేశారు పరమేశంగారు.

వీరాస్వామిగారు పెద్దపెద్ద అంగలు వేసుకుంటూ వెళ్ళిపోయారు. ఆయన వీథిమలుపు తిరిగిపోయే వరకూ అక్కడే నించొని, మలుపు తిరిగిపోగానే "హమ్మయ్య" అని పెదవి అదోతమాషాగా విరిచారు. ఆ 'హమ్మయ్య' అంటంలోనూ, ఆ పెదవి విరవటంలోనూ 'పీడ విరగడైపోయింది' అనే భావం స్పష్టంగా ఎవ్వరికే కళ్లలోంచి చూసినట్లు వ్యక్తమయింది.

వీరాస్వామిగారు వెళ్లి నాల్గురోజులైంది.

# హాస్య కథలు

**తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు**

"శ్రద్ధగా బడి పాఠముల్ చదువుచున్న
బాలకా! తండ్రిగా రింటివద్ద కలరె?"
"నాన్నగా రింటివద్ద లేకున్నయెడల
ఇంత కష్టనిష్ఠురము నా కేలనయ్య"

తనకు నభిమానమైన గ్రంథమ్ము పేర్ల
నొక్క నూటికి తక్కువ యుండనట్లు
వ్రాయు మన్నంత నొక వణిగ్వరుని కొడుకు
వందసార్లు వ్రాసెను బ్యాంకు ప్యాసుబుక్కు॥

"భారతీయంబు దర్శనభాష్య మొకటి
చాలచక్కని గ్రంథమ్ము చదువుమయ్య"
"దానికొరకింత వేచియున్నాను నేను
మంచిదైన యెడల సినిమాకు నెక్కు"

# ★ గోముఖవ్యాఘ్రం ★

పరమేశంగారు తనపాచిక పారిందికదా అని పరమ సంతోషంలో ఉన్నారు. మంచి మాత్రవేసి మరలించేశాంగదా అని మహదానందభరితుడైపోయాడు. కడుపులో ఉన్న ఉక్రోషమంతా తీరిపోయినట్టు ఉషారుగా ఉన్నాడు. 'పరమేశం అంటే యేమనుకున్నారో వెధవలు, విజృంభించి వాళ్లు బాగుపడదామనే కాబోలు. ఇప్పుడు తెలుస్తుంది అబ్బాయిల సత్తువ.' అనుకొంటూ కుచ్చులాంటి తన మీసాన్ని ముచ్చటగా యెన్నోసార్లు దువ్వుకున్నారు యీ నాలుగురోజులూ. ఇప్పుడుకూడా అదే అనుకొంటూ ఇంటిలోంచి బయల్దేరారు. గుమ్మం దిగుతుండగా పోస్ట్‌మేన్‌వచ్చి 'పోస్ట్' అన్నాడు.

"ఉండవయ్యా, యేంపోసు?" పరధ్యానంగా అనేసి పోబోతున్నారు, పరమేశంగారు.

"మీకేనండీ పరమేశంగారు! ఏంపోస్టని వెళిపోతారేం?" పోస్ట్‌మేన్ రెటించాడు.

"ఓహో! లేదు నాయనా! ఏదో అలా పరధ్యానంగావున్నాలే. యిలా తే!" అంటూ కవరు తీసుకొని లోపలికివెళ్లారు. కవరుచించి చూసేసరికి ఓ పెద్ద ఉత్తరంఉంది దాంట్లో. ఇలా చదవడం మొదలెట్టారు:

పెద్దాపురం
ది......

చిరంజీవి పరమేశంగారికి!

వీరాస్వామి దీవించి వ్రాయునది—

మీవద్దనుంచి బయల్దేరి యింటికి సురక్షితంగానే చేరుకున్నాను. మీరు చూపిన ఆదరణకి యెంతో ఆనందించాను. మీ మేలు జన్మలో మర్చిపోలేను. మీకు ఎన్నో విషయాలు రాయాలని అభిలాషుంది. కాని అన్నీ రాయటానికి నాకవకాశం లేదు. అయినా కొన్ని తప్పకుండా రాయాలని సంకల్పించుకొని రాస్తున్నాను.

మీరు వెళ్ళిపొమ్మని చెప్పనవెంటనే నేను పెద్దపెద్ద అంగలు వేసుకొంటూ వెళ్ళిపోయాను. ఎందుకంటే నేను నిజంగా వెళిపోయినట్టు మీకు నమ్మకం కలిగించడం అవసరమనితోచి అలా చేశాను. మరొకళ్లైతే నిజంగానే వెళ్లిపోయేవారేనేమో! కాని నేనలా ఎందుకుచేస్తాను? నేనేకాదు వ్యవహారపరిజ్ఞానంగలవాళ్ళెవరైనా అలా చేయరనే నా అభిప్రాయం. ఆ వ్యవహార పరిజ్ఞానంతోనే, కర్రవిరగని, గొర్రెచావని పద్ధతిలో మీ ఎదుట అలా సంచరించి తిన్నగా సాంబమూర్తిగారింటికి వెళ్ళాను. అలా వెళ్లడంలో నాపుద్దేశం వాస్తవపరిస్థితులు తెలుసుకుందామనే సుమండీ.

వెళ్ళాక నాకు యాథార్థమైన విషయాలు తెలిశాయి. యీ విషయాలు నాకంటె మీకే బాగాతెలుసు. అయినా పరాకుపడ్డారేమోనని—అటువంటి పరిస్థితికి అవకాశం లేదనుకొండి—రాస్తున్నాను.

మీరు శెలవిచ్చినట్టు ఆ కుర్రాడి అప్పగారు లేచిపోవడం నిజమే. అయితే అటువంటి విషయాల్లో నాకంత పట్టింపులేదు. తర్వాత, శంకరయ్యగారు 'పిల్లవాడి పెత్తండ్రి' అన్న విషయం నాకు ముందుగానే — అంటే ఆయన మా గ్రామం వచ్చినప్పుడే— తెలుసు. కాని మీ దగ్గిర తెలీనట్టు నటించాను. అలా నటించాల్సిన పరిస్థితి గనక అలా చేశాను; క్షమించండి.

ఇక ఆఖరున మీకు తీక్షణంగా రాయాల్సిన విషయం మరోటుంది. మీ వంటి గోముఖవ్యాఘ్ర మనస్తత్వాలు గలవాళ్లు సమాజాన్ని వెంటాడుతున్నంతకాలం, సమాజపురోభివృద్ధి సున్న. ఘాటుగా రాస్తున్నానని గాబరా పడకండి. ఏం చేయను? విషయం అలాంటిది. లేకపోతే—అయ్యా, పరమేశంగారూ! అసలు విషయం ఇదే, జాగ్రత్తగా చదువుకోండి,—లేకపోతే మీ అమ్మాయిని చేసుకోలేదని, ఇక ఏ సంబంధం వచ్చినా ముందుగానే మీరు కల్పించుకొని ఏదో అభూతకల్పనలన్నీ వాళ్ళమీద చెప్పి, ఆ వచ్చిన సంబంధాల్నన్నిటినీ వెళ్ళగొట్టేస్తారా? ఇదా మీరు తలపెట్టిన మోసం? అయినా, మోసం ఎంతకాలం దాగుతుందండీ? మీ విషయంలో వెంటనే బయటపడిపోయింది.

జరిగిందేదో జరిగిపోయింది. చి॥ సౌ॥ మా అమ్మాయికీ, చి॥ ఆ అబ్బాయికీ వివాహం నిశ్చయమైపోయింది. ముహూర్తం ఇంకా పెట్టించలేదు. పెట్టించాక రాస్తాను. పెళ్లికి మీరు తప్పకుండా రావాలి.

ఇట్లు మీ శ్రేయోభిలాషి,
వీరాస్వామి.

ఉత్తరం ముగిస్తూనే, నేలమీద కుప్పలా కూలబడిపోయారు పరమేశంగారు. "జాటాగాడిద! నమ్మకంగా గొంతుకోసాడు." అన్న వాక్యాలు ఆయన నోటినుండి బరువుగా వెలువడ్డాయి. ★








గజాసురుని ఉదరంలో అడగివున్న వాడల్లా రమాపతి ధర్మమా అంటూ ఉమాపతి ఊడి బయటపడ్డాడు.

"ఇకనైనా స్తోత్రపాఠాలకు పోలి కష్టాలు కొని తెచ్చుకోవద్దయ్యా నాయనా! భక్తులపట్ల ఎంత ఆసక్తివున్నా కొంత బింకొనవుండు!... వెళ్లు! వెళ్లు! కైలాసగిరి భారాగ్రాన్నధిష్ఠించి కన్నులు కాయలు కాచేలా 'అంబ' నీదివ్య సందర్శనంకోసం ఎదురుచూస్తోంది" వగైరా...వగైరా



కత్తిరింపుల చిత్రం: బి. మల్లేశ్వరరావు, (అనకాపల్లి)

మెత్తటి చివాట్లుపెట్టి, నారాయణుడు, నాటకంలోని పాత్ర పూర్తి అయినట్టు నిష్క్రమించాడు.

రమా...ఉమాపతుల కిదినిత్యం వున్న భాగవతమే! ఉమాపతి తెలిసో తెలియకో ఊచ్చుల్లో బిగుసుకుపోవడం, రమాపతి మాంచి రసకందాయఘట్టంలో ఎక్కడున్నా సరేఅమాంతం వచ్చేసి, ఏదో నాటకం ఆడేసి, భోలానాథుణ్ణి రక్షించేయడం! ఇదీవరస!

కాకుంటే గజాసురుడు చస్తూ "హే! శంకరా! ఆది దేవా; నా శిరము త్రైలోక పూజ్యంబు చేయవే!" అన్నాడు కదా.

మరి యీ ఆదిదేవుడు గత్యంతరం లేనివానిలా గంభీరము గ్రహించి "నాయనా! నీవు క్రితం వరం పుచ్చేసుకొనినన్ను నీ ఉదరంలో అట్టే పెట్టేసుకున్నావాయెను. చాల్చాలు. ఇక నీకు వరమన్నది మంజూరు చేయబడదు." అన్నాడు గనకా! లేదుసుమా! హితవుచెప్పి వెళ్లిన, పాటి దేవుని, పరువు ప్రతిష్ఠ కించిత్తుగూడ నిలబెట్టలేకపోయాడు.

"గజాసురా! అలాగే జరుగుతుంది! నీ శిరము త్రైలోక పూజ్యమవుతుంది! ..." అంటూవరం కాస్తా మంజూరు చేసేశాడాయెను! ఆ నాగభూషణునికి వెనుకా ముందూ ఆలోచన ఏమైనావుందా! ఎన్ని ఆపదలు వచ్చినా దుష్టసంహారకుడు వుండనే వున్నాడని అతగాని ధీమా కాబోలు!

తక్షణం గజాసురుని, ఏనుగుతల చంకన బెట్టుకొని స్వేచ్ఛ లభించిందని హాయిగా, గాలిపీల్చుకొని, అటు యిటు జారిపోతూ, ఆటలాడుకుంటున్న నాగుల్ని గదమాయించకుండా అర్ధాంగిని మాడాలనే ఆత్రుతలో

★ శింగంపల్లి

కైలాసగిరివైపు పరుగు లంకించుకున్నాడు భోలానాథుడు.

అక్కడ కైలాసగిరిపై గిరికుమారి దేవతలవలన భర్త ఆగమన వార్త విన్నదై భారంగా ఒక్కపరి నిట్టూర్చి—

"అబ్బ! ఎన్నినాళ్లి కెన్నినాళ్లకు! స్వామిలేని కైలాసం స్థాణువుగా నిశ్శబ్దతలో మునిగిపోయింది! ఇకను కొదువే లేదు! ఆదిదేవుని తాండవ నృత్యాలతో కైలాసగిరి



# ాయకుడు

దిలిపోతుంది. పదునాలుగు భువనాలు పర వశత్వంలో పరవళ్లు త్రొక్కుతాయి." అనుకుంటూ, మురిసిపోతూ మైమరచింది.

ఎలాగైనా ఆదిదేవి! ఆయమకు ఆది దేవునియెడ ఎంత భక్తి తత్పరతలో, ఎంతటి ప్రేమానురాగాలో చెప్పలేము. తనకు అర్ధశరీరం యిచ్చి ఎవరికీ దక్కని గౌరవం కల్పించాడని కాబోలు ఆ మక్కువ!

శుచిగా స్నానంచేసి వస్తున్న అయ్యా

## అప్పారావు ★

వారిని పూజించాలని పార్వతి ఉబలాటం! స్నానం చేయబోయేముందు, నలుగుపిండి ముందుపెట్టుకొని, ఏమి లేమిటో ఊహించు సంటూ, తమ సతీపతుల ఎడబాటు... భారమైన దినాలు తలచుకొని, అచేతను రాలై, అలాగే నలుగుపిండితో పిచ్చిగా చిన్నబొమ్మను తయారుచేసింది. ఆమె ఊహాజగత్తునుంచి ఊడిపడి, బొమ్మవైపు చూస్తే మూడగా అది ఎంతో ముద్దొస్తున్నట్టుగా




అనిపించింది దానికి ప్రాణం పోస్తే ఎలా వుంటుందో చూడాలని అనుకున్నది పార్వతి. ఆదిశక్తికి శక్తులకేం తక్కువా!.... అనుకున్నదే తడవు ప్రాణంపోసింది...పోసీ పోయగానే బొమ్మకు కండ పుష్టి కలిగినిటారుగా నుంచుంది ...నుంచుందీ కాదు... నుంచు న్నాడన్న మాట... అతనే




పార్వతీదేవి ప్రథమ పుత్రుడు...ఇక నాదేవి ప్రథమ పుత్రుని పరికిద్దాం!.:. మనిషి కొస్త పొట్టి. పొట్ట బానలా వుంటుంది మరి! మరు గుజ్జు అనుకోవచ్చు యించు మించు.

ఆ పొట్టయ్య జీవంపోసుకుంటూనే లేచి నిలబడి "అమా! అమ్మా! మరేమోనూ, నాన్నఏడే" అనేశాడు. పొట్టివాడు కదూ! పుట్టెడు బుద్ధులు.

పొట్టయ్య 'అమ్మా!' అనగానే పార్వతీ దేవి మాతృహృదయం సంతోషించింది. మాతృప్రేమ ఆమె హృదయ కుహంరలో నుంచి పొంగి పొర్లుకువచ్చింది.

"నా చిట్టితండ్రీ!...నాన్న కావాలా! వస్తారమ్మా వస్తారు. నిన్నుచూసి ఎంత సంతోషపడతారో! చూడుబాబూ! అలా

బయటకూర్చో...లోనికి ఎవరూ రాకుండా చూడు. ఈలోగా స్నానంచేసి వచ్చేస్తాను." అన్నది లోకేశ్వరి.

"ఊఁ...అలాగే నమ్మా! నీమనుకూడ లోనికి రానివ్వను" అంటూ బొజ్జయ్య గెంతుకుంటూవచ్చి బయట, మంచుచే కప్ప బడిన రాయిపై కూలబడ్డాడు.

కొంపమునిగినట్లు శంకరుడు రానే వచ్చాడు. వచ్చిన శంకరుణ్ణి బొజ్జయ్య ఆపనే ఆపాడు...గౌరీపతికి కోసం వస్తుం

దంటే రాదు మరి!...

"బాలకా! దారికి అడ్డుతొలగు! లోనికి వెళ్లాలి!" అన్నాడు!—భోలానాధుడు అమాయకుడు గాకపోతే, అసలు ఆకుర్రవా డెవరు? ఇక్కడి కెలావచ్చాడు! ఏమిటి సంగతి సందర్భం అని దివ్యదృష్టిని వీక్షిం చాడా!...లేదు అతనిదృష్టి భార్యా ముఖసందర్శనాభిలాషియై వున్నది.

బొజ్జయ్య మాతృమూర్తి చెప్పినమాట జవదాటడు. ససేమిరా లోనికివెళ్ళ వీల్లే దన్నాడు.

"ఆఁ...ఎంతటి సాహసము! నేనెవరో తెలుసా!" అంటూ ఖడ్గ్రదేసాడు త్రినే త్రుడు. ఇంకానయంత్రినేత్రం తెరిచాడు కాదు.

బొజ్జయ్య బిగ్గరగానవ్వాడు "తెలుస్తూనే

# వి(ఘ్న)నాయకుడు

వుంది. ఆ వేషం...ఆ పాములు... బూడిద ...భిక్షుగాడిగా వున్నావు!" భిక్షుకావలిస్తే ఘడియసేపు తాళు! తొందర అయితే వెళ్లిపో అన్నాడు.

పాపం! పరమేశ్వరునికి ఎంతటి ఆశాభంగం! ఎన్నో సంవత్సరాలు గజాసురుడి ఉదరంలో ఆదరవు లేక అలమటించి, యెట్టకేలకు తెప్పరిల్లి తేరుకొని కైలాసగిరి చేరుకుంటే మధ్యన నలుసువలె యీ కుర్రకుంక ఎవడు? అన్న చిరాకు, కోపం, శంకరుడికి కలిగాయి.

ఆదిదేవునికి ఆగ్రహం రానేరాదు. వచ్చిందంటే పోదు! వెంటనే త్రిశూలం పైకెత్తి బొజ్జయ్య కంఠానికి గురిచూసి విసిరాడు! అయ్యో! ఇంకేముంది! పరమేశ్వరి ప్రేమతో సృష్టించుకున్న బొజ్జయ్య శిరస్సు కాస్తా తెగి ఎగిరి చక్కాపోయింది. ఆమె పోసిన ప్రాణవాయువులు, అనంతశక్తుల్లో కలిసిపోయాయి. బొజ్జయ్య మొండెము మంచులో పడిపోయింది.

ఆదిదేవుడు లోనికి వెళ్లాడు. అప్పటికి పార్వతి స్నానాదులు పూర్తి అయాయి. వస్తున్న అర్థనారీశ్వరుని చూసి ఎదురువెళ్ళి ఆలింగనం చేసుకొని, తమ ఎడబాటుకు సూచనగా, కన్నీరు కార్చింది. భోలానాథుడు మంచులా కరిగిపోయాడు.

"ఇక నిన్ను వదలి వెళ్ళను! నేను ఎక్కడ వుంటే నీవూ అక్కడే వుందువుగాని" అభయహస్తమిచ్చాడు స్వామి.

ఇష్టాగోష్ఠిలో మునిగిపోయారు సతీపతులు! క్షణకాలం క్రితం 'ప్రాణప్రతిష్ఠ చేసి' ముద్దుమురిపాలలో ముంచి తేల్చిన ఆ మాతృదేవికి బొజ్జయ్య విషయం జ్ఞాపకం రాకపోవడం ఆశ్చర్యమే!... 'గొడ్రాలు కేమి తెలుసు కన్న కడుపు తీపి!' అన్నట్టుంది. పార్వతి నవమాసాలు మోసి కన్నకడుపు పంట కాదు బొజ్జయ్య! అందుచేతనే ఆమరపు!

ప్రసంగవశాత్తు పరమేశ్వరుడే తన అఘాయిత్యాన్ని బైటపెట్టాడు. అప్పటికిగాని బొజ్జయ్య విషయం శంకరికి స్ఫురణకు వచ్చింది కాదు.

"అయ్యో! ఎంత అమాయకులండీ! ఆ బాలకు డెవరో అని ఎలా భావించారండీ! వాడు మన ముద్దులపట్టి అన్న గ్రహింపే లేకపోయింది మీకు! ఇపుడేమి చేతును! నా బాబు లేకుండా ఘడియకూడ నిలువలేను. నా చిట్టితండ్రిని నాకు తెచ్చియివ్వండి!" అంటూ లోకేశ్వరి ముద్దుగా రాగాలు తీసింది. పాపం! ఆదిదేవుని అమాయకత్వాన్ని చివరకు అర్థాంగికూడ ఎత్తిపొడిచింది.

'తనకు తెలియని ముద్దులపట్టి ఎవరా అని! ఆ అర్భకుణ్ణి నేను చూడలేదే!' అనుకొని భోలానాథుడు తెల్లముఖం వేశాడు, తదుపరి ఏమో! లోకేశ్వరికి మానసపుత్రుడు కాబోలు! అని సమాధానపడి బొజ్జయ్యను బ్రతికించ బయటకు వచ్చాడు. మొండెము సుంద్రంగా బంతిలా కనిపిస్తూనే వుంది. కాని తల ఏదీ? శంకరుడు మల్లో కాలు వెదికినా, పార్వతి చేసిన బొజ్జయ్య తాలూకు తల కనిపించనే లేదు. ఎలా కనిపిస్తుందీ! నలుగురూ అనుకున్నంత అమాయకుడు కాదేమో పరమేశ్వరుడు. ఆ తల కనిపిస్తే గజాసురుని శిరస్సుకు విలువేముంటుంది! అందుకనే పార్వతి చేసిన తలను విచిత్రంగా మాయం చేశాడు.

తప్పుచేసినట్టు తలవంచుకొని అర్థాంగి చెంతకు చేరి "మరేమో మల్లో కాలు వీక్షించాను: మొండెము వుంది కాని తల కనిపించలేదు. అయినా మించిపోయిందిలేదు. నేను ఫలానా గజాసురుని శిరస్సు తీసుకువచ్చాను. అది అతికించి ప్రాణప్రతిష్ఠ చేస్తాను. మరి నీకు యిష్టమో కాదోననీ..." అంటూ నసిగేశాడు త్రినేత్రుడు.

"...అయ్యో! ఇంకా సంశయిస్తారేమండీ! ఆలస్యమైతే ఆ మొండెము కూడా దక్కదేమో! మీకు నా పట్టిని బ్రతికించడం యిష్టం లేదల్లే వుంది!" అంటూ అంటూ నిష్ఠుర వాక్యాలు పలికింది.

"సరిసరి! ఇదో హటాహైగా! నీ పుత్రుడు నా పుత్రుడు కాదూ! వింతగా మాట్లాడుతున్నావు దేవీ!" అంటూ శంకరుడు ఆదరాబాదరా వచ్చి గజాసురుని శిరస్సు, మొండానికి అతికించి ప్రాణప్రతిష్ఠ చేశాడు.

నాటినుంచి బొజ్జయ్య 'గజానను' డయ్యాడు! ఆదిదంపతులకు అతనంటే ఎంతో ముద్దు! పరమేశ్వరునకు మరీనూ! కాదుమరి! పదునాలుగు భువనాలలోని జీవరాశులూ, ఆదిదేవుని సంతానమైనా, గజాననుడు వారి మానసపుత్రుడు కావడంచేత వారికి ప్రీతిపాత్రుడే మరి!

తదుపరి పుట్టినవాడే కుమారస్వామి, ఇతను పొడగరి. బలిష్ఠుడు. దేవతా సైన్యాధ్యక్షుడు. వాహనం నెమలి.

## విఘ్నాధిపత్యం

ఒకనాడు సకలమునిగణం బ్రహ్మాది దేవతలు కైలాసం వచ్చి పరమశివుని పూజించి "దేవా! విఘ్నములకు అధిపతి నొకనిని మాకు ప్రసాదించవలసింది. అతనిని పూజించి మా స్వకార్యముల కెట్టి విఘ్నములు రాకుండ సుఖులమై వుండగలము!" అంటూ ప్రార్థించారు.

ఆదిదంపతుల కిరుకెలంకులా ఉపవిష్టులై వున్నారు గజానన, కుమారస్వాములు!

ఆ విఘ్నాధిపత్యం తనకిస్తే ఎంతో బావుంటుంది సుమా! అనుకున్నాడు గజాననుడు. కాని అంతలోనే ఆ ఆలోచనకు తిలోదకాలిచ్చుకున్నాడు.

'తనకన్నా తమ్ముడు సర్వశక్తిసంపన్నుడు అదీగాక దేవతలకు సర్వసైన్యాధ్యక్షుడు. నాన్నగారు విఘ్నాధిపత్యం వాడికే ధారపోస్తారేమోనని అతని నిరుత్సాహం.

అలాగని మనం ప్రయత్నం చేయకుండా మానేస్తామా! ప్రయత్నించి చూద్దాం! అనుకున్నాడు.



రాజు : సేవకా! మన దేవేరి ఎచ్చట?

సేవకుడు : ప్రభూ! వెలుపల...

రాజు : అయినచో నేటికిక ఆటలేదని ప్రేక్షకులకు చెప్పుము...

అనుకొని మెల్లగా "నాన్నగారూ! విఘ్నాధిపత్యం నాకు ప్రసాదించరూ! వాడికన్నా నేను పెద్దవాడిని! ఏ అధికారమైనా ముందు నాకు రావాలి! మీది అసలు పక్షపాతబుద్ధి! మొదటినుంచీ నేనంటే మీకు కోపమే! కాకపోతే సైన్యాధికారాన్ని చిన్నవాడికెలా యిస్తారు!" అంటూ విమర్శనాపూర్వకంగా మాట్లాడాడు గజాననుడు.

అతనన్నదాన్ని సమర్థించింది లోకేశ్వరి! 'పెద్దవాడు వుండగా చిన్నవాడు అధికారం చలాయించడమనేది ఎక్కడా లేదు. పోదురూ! మీ పాలన యిలాగే వుంటుంది!" అంటూ ఎవరికీ వినిపించకుండా అన్నది ఆదిశక్తి.

కుమారస్వామి తక్కువ తిన్నాడు గనకా!

"అన్నయ్య యీర్ష్యచేత అలాఅంటాడు కానీ, మీ రెప్పుడు పక్షపాతబుద్ధి చూపించారండీ! అన్నయ్య మరుగుజ్జు. పైగా ఏనుగు తల! పెద్ద బానలాంటి పొట్ట. కూర్చుంటే లేవలేని స్థితి. అలాంటి వారికి సైన్యాధికారం ఎవరైనా ఎలా యిస్తారండీ! ఇది అంతే! అన్నయ్య విఘ్నాధిపతి పదవికీ అనర్హుడు! ఆ పదవి కూడా నాకే ప్రసాదించండి!" అంటూ యితగాడు సత్యాన్ని నిరూపించిన వీరుడిలా మాట్లాడాడు.

ఇద్దరి వాదం విన్న తరువాత శంకరుడు సందిగ్ధంలో పడ్డాడు.

ఎట్టకేలకు తెప్పరిల్లుకొని "అబ్బాయిలూ! మీరు చెప్పింది బాగానే వుంది! కాబట్టి ఎవరు అధికశక్తి సంపన్నులో పరీక్ష పెడతాను. నెగ్గినవారికి విఘ్నాధిపత్యం యివ్వబడుతుంది." అన్నాడు పరమశివుడు.

పరీక్ష అనగానే ఎగిరి గంతేశాడు కుమారస్వామి!

చప్పగా చల్లబడి నీళ్లు కారిపోయాడు గజాననుడు.

"పదునాలుగు భువనాలలోని మూడు కోట్ల యాభైలక్షల పుణ్యనదీజలాలలో స్నానమాచరించి, ఎవరు ముందుగా కైలాసగిరి చేరుకుంటారో వారు విఘ్నాధిపత్యానికి అర్హులు" అన్నాడు పరమశివుడు.

"ఓహో! భళే!" అనుకుంటూ కుమారస్వామి వెంటనే నెమలి వాహనంమీద, ఎగిరిపోయాడు.

గజాననుడు కూర్చున్నచోటునుంచి కదలకుండా, విచారంగా ముఖంపెట్టి "నాన్నగారూ! మీ కిది న్యాయమా! ఎంత పక్షపాత బుద్ధి! ఒక్క అడుగు కదపడమే గగనమయే నాకు పదునాలుగు భువనాలు తిరిగి మూడుకోట్ల యాభైలక్షల పుణ్యనదులలో స్నానమాడి రావడం అంత సులభం కాదనే కదూ మీరీ పరీక్ష పెట్టారు! అదిగాక వాడికి వాయువేగంతో పయనించే నెమలిని వాహనంగా యిచ్చారు. కాని నాకు యిటు నటు మెల్లగా తిరిగే మూషికాన్ని యిచ్చి నా కన్నీళ్ళు తుడిచారు!...అన్యాయం! చెప్పండి! మీది పక్షపాత బుద్ధి కాదంటారా!" అంటూ ఒక్కసారే భోరుమన్నాడు గజాననుడు.

## నారాయణ మంత్రం

ఏమీ తనకు తెలియకుండానే గజాననుడికి అన్యాయం జరిగి వుంటుంది. పెద్దవాడు చెప్పిన విషయం సబబుగానే కనిపించింది పరమేశ్వరుడికి.

"బాబూ! విఘ్నాధిపతిత్వం నీకే ప్రసాదిస్తాను. నారాయణ మంత్రం ఉపదేశిస్తాను. ఈ మంత్ర ప్రభావంవల్ల, మూడుకోట్ల యాభైలక్షల పుణ్య తీర్థములలోనూ, స్నానమాచరించినట్లవుతుంది!" అంటూ పరమశివుడు గజాననుడికి నారాయణ మంత్రం ఉపదేశించాడు.

# ★ వి(ఘ్న)నాయకుడు ★

కడుపులో నిచల్ల కదలకుండా, కూర్చున్న చోటునుంచి లేవకుండా, గజాననుడు నారాయణమంత్రాన్ని జపిస్తూ కైలాసంలో వున్నాడు.

మూడుకోట్ల యాభైలక్షల పుణ్యనదులలో స్నానమాడుటకు వస్తున్న కుమారస్వామికి స్నానమాడి వెళ్ళిపోయే గజాననుడు కనిపించేవాడు. అదంతా నారాయణ మంత్ర ప్రభావం!

కుమారస్వామి కైలాసం చేరుకొనేసరికి అక్కడ గజాననుడు ప్రత్యక్షం. దానితో కుమారస్వామి తండ్రి కొడుకులు చేసిన మోసాన్ని గ్రహించలేక "నాన్నగారూ! అన్నగారి శక్తి తెలుసుకోలేక దూషణగా మాట్లాడాను. విఘ్నాధిపత్యం అయనకే యివ్వండి!" అంటూ ఓటమిని అంగీకరించాడు.

పరమేశ్వరుడు భాద్రపద శుద్ధ చతుర్థశి నాడు విఘ్నాధిపతిపదవి గజాననుడికిచ్చాడు.

ఆ నాటినుంచి గజాననుడు విఘ్నాధిపతి, వి(ఘ్న)నాయకుడు అని పిలువబడుతున్నాడు.

## పొట్టలో ఉండ్రాళ్లు

ఆ నాడు సకల మునిగణం, బ్రహ్మాది దేవతలు వినాయకుని ఎంతో భక్తితో పూజించారు. తమ పనులకు ఎట్టి విఘ్నములు రాకూడదని ప్రార్థించారు. ఈ పెద్దలంతా పూజించి వూరుకున్నారా!...ఉండ్రాళ్లు, కుడుములు, అపూపములు, పానకము, వడపప్పు, గంగాళాలకొద్దీ తెచ్చి లంబంయిచ్చుకున్నారు. పాపం, వినాయకుడు ఎన్నాళ్ళనుంచి ఆకలిగా వున్నాడోమరి! ఉండ్రాళ్లు, కుడుములు, అన్నీ ఒక్కటి మిగల్చకుండా, [illegible] పొట్టలోనికి ఎక్కించేశాడు. దానితో పొట్ట, సూదిమొనలా, ముందుకు పొడుచుకు వచ్చేసింది.

తన తిమ్మడితో స్వగతం కావలసిన విఘ్నాధిపతి పదవి దయచేసి పరమశివుడు తనకు ప్రసాదించాడు. వారికి భక్తిపూర్వకంగా నమస్కరించి తన కృతజ్ఞత తెలుపుకోవద్దూ! అనుకొని వినాయకుడు, తిన్నగా, తల్లిదండ్రులవద్ద కొచ్చాడు వచ్చినవాడు అలా ముందొంగి నమస్కరించవచ్చుకదూ! తిన్న దానికి ఇంకా భుక్తాయాసమైనా తీరలేదాయె! తన భక్తి భావాన్ని చూపిద్దామని కొబ్బోలు సాష్టాంగ దండప్రణామం చేశాడు. అయ్యో! పాపం! అసలే మరుగుజ్జు. పైగా పొట్ట ఉండిందంతలు ముందుకు పొడుచుకు వచ్చిందాయెను. అలా సాష్టాంగదండ ప్రణామం చేయడంలో, కాళ్ళూ, చేతులూ పైకి లేచి గాలిలో తేలిపోయాయి. చప్పున పరిస్థితిని గ్రహించాడు వినాయకుడు. ఎలాగో తంటాలు పడి, కొంత మేరకు పొట్టను లోనికి వదించి చేతులు నేలకు ఆనించాడు. ఇంకేముంది! కాళ్లుపూర్తిగా ఆకాశంలోని చుక్కల్ని చూశాయి. అతికష్టంమీద కాళ్లను నేలకు ఆనించేసరికి చేతులు పైకి వెళ్ళాయి.

అప్పటి వినాయకుని పరిస్థితి కొంత విచారంకేయమూ మరి కొంత హాస్యాస్పదమూనూ! ఎవరికైనా నవ్వురాక మానదు. చంద్రుడు నవ్వాడంటే నవ్వడూమరి!——

తండ్రి కొబట్టి పరమశివునికి నవ్వురాక పోవచ్చు!

ఎంతటి సవతితల్లి అయినా, గంగాభవానికి వినాయకుడు కుమారుడే గనక ఆమె కూడానవ్వగూడదుమరి! ఎటూ సంబంధబాంధవ్యాలు లేనివాడు కొబట్టి చంద్రుడు నవ్వాడు! ఆ పరిస్థితుల్లో ఎవరికైనా నవ్వు వస్తుంది!

అతను నవ్వినపుడే అప్పటి వరకూ వినాయకుడి పొట్టలో ఎలాగో ఓపిక పట్టుకొని, చోటులేక తికమక పడుతూ అవస్థపడుతున్న ఉండ్రాళ్ళ గుట్టలూ, కుడుముల పర్వతాలూ ..యిక వుండలేక, అతగాని పొట్టను చీల్చుకొని బయటకు వచ్చేశాయి. ఇంకేముంది వినాయకుడు, మృతదేహుడయాడు. ఆ హృదయవిదారక దృశ్యం చూడగానే పరమేశ్వరి మూర్ఛపోయింది. కుమారుని స్థితికి పరమేశ్వరుడు చలించలేదు కాని...అర్ధాంగి మూర్ఛపోవడంగానే, అదిరి పడ్డాడు. వెంటనే బిందువులు, ఆమె ముఖ మండలంపై చిలికి సేదదీర్చాడు.

## చంద్రుడికి శాపం

ఆదిశక్తికి దుఃఖం మాయమైంది. కోపం తలకున్నగా ముంచుకు వచ్చింది. అట్టే తీక్ష్ణంగా చంద్రుడివైపు చూసి:

"ఛీ! పాపాత్ముడా! నీ పాపిష్టి చూపు, విషపునవ్వు నా కుమారుని పొట్టను పొడ్చినవ్నాయి. నీ చూపువల్ల రాళ్లుకూడా బద్దలవుతాయి. నిన్ను క్షమించి విడిచిపెట్టడం మంచిదికాదు. ఇకనుంచి నిన్ను చూసినవారు నీలాపనిందలకు పాలై కుంగుదురుగాక!" అంటూ చంద్రుని శపించింది

ఎంత అన్యాయం! లోకానికి మతి పోయిందా! ఆదిశక్తనని అహంకారమా! పొట్టపట్టకుండా కుడుములు మెక్కుతున్న తిండిపోతుగా వున్నాడని, అతిగా తినడం అపాయకరమని మందలించలేకపోయిందా! లేక ఆ నాడు పిండితో బొమ్మను చేసినపుడే బలిష్ఠంగా, పొడవుగా తయారుచేయలేకపోయిందా!... అతని కా మరుగుజ్జుతనం ప్రసాదించి నలుగురూ నవ్వేట్టు ఎందుకు చేయాలి?.. చంద్రుడు నవ్వినందుకే వినాయకుని పొట్ట పగిలిందని ఎందుకనుకోవాలి? కుడుములు, ఉండ్రాళ్ళు అతిగా తిన్నందువల్లనని ఎందుకనుకోగూడదు?...నిరపరాధికా శిక్ష!——ఆ శాపం చంద్రుడు ఒక్కడితోనే అంతం కాలేదే!.. నిత్యం ఆ చల్లని జాబిల్లిని దర్శించుకొని హాయిననుభవించే ప్రతి ఒక్కరికీ ఈ శాపంలో భాగంవుంది. ఎంత అన్యాయం!

లోకేశ్వరి శాపం వినికూడా ఆ పడమ [illegible] ఏమైనా ఖండించాడా, ఆ పరమేశ్వరుడు. లేదు! తన తలపై ఎంతో ఠీవితో పొందికగా అమరివుండే తన కంఠానికి శోభ కూర్చుతున్న గంగకా ఈ శాపం! నిత్యం సకల మునిగణం, బ్రహ్మాదిదేవతలు తన దర్శనార్థం వస్తారుకదా! తనసిగలో వున్న చంద్రుని చూడకుండా వుంటారా? అప్పుడు పరమభాగవతోత్తములు నీలాపనిందలు పొందరా! లేక నీలాపనిందలు పొందుతామేమోనని అసలు వారు కైలాసగిరికే రావడం మానేస్తారు కదా! ఎంతటి అవమానముపాలు కావాలో నన్న శంక శంకరునకమైనా వుందా?——గిరికుమారి ఎంతటి అదృష్టవంతురాలో.. అన్యాయం జరిగినా అర్థాంగిమాటకు జవదాటడానికి స్థితి కారు!

'అంబ'కు కోపం ఇంకా ఎక్కువై, అనర్థాలు ఒనగూడకముందే భోళానాథుడు మెడనున్న నాగుపాముని తీసి విఘ్నేశ్వరుని పొట్టకు నడుముకట్టి, మళ్ళా ప్రాణప్రతిష్ఠ చేశాడు. అప్పటికిగాని పార్వతి కోపతాపాలు, దుఃఖమూ ఉపశమనం కాలేదు.

చంద్రుడు నవ్వినందుకే మరణించి వినా... మరింకెందుకు [illegible], వినాయకుడు మళ్ళా ఎలాగు [illegible] వుండాడు! ఆ సంగతి ఎవ్వరికీ తెలుసు. తెలిసికూడా నిరపరాధి అయిన జాబిల్లిని శపించడం అన్యాయమని [illegible] ఎవరికీ తోచలేదు.

## శాపానికి విరుగుడు

అంగుళంత అందమైన [illegible] మీద [illegible] చేసి, ఆదిదంపతులు [illegible] చేసుకున్నారు.

శాపం ఇచ్చింది లోకేశ్వరి, శంకరుణ్ణి ప్రార్థించడం ఇష్టంలేక ఆశాజనకం కాదని "జగజ్జననీ! సకలమూ తెలిసిన నీవే యిలా చంద్రునికి శాపం ఇవ్వడం హర్షించతగ్గ విషయం కాదు. మాకు చంద్రుని చూడని దినము లేదు. మరి మేము కూడ నీలాపనిందలు

(42-వ పేజీ చూడండి)



## యథా రాజా...



"ఎవర్రా! ఆవిడొచ్చిందా ఏం! ఖర్మ?"

"మా బలే సెప్పారు బాబయ్యా! ఆవిడ గోకేనండి!"

"వచ్చి ఏమందిరా!"

"అదేటో యిస్కూలు సందాట బాబయ్యా!"

"ఒరెరె! ఏం సెప్పావురా!"

"అదేనండి బాబయ్యా!"

"ఏం చెప్పావురా బాబూ!"

"ఓసి! నేనంత తెనివి నేనోడ్నా బాబయ్యా!"

"వెధవా! చంపక చెప్పరా!"

"అదిగదేనండి! బాబయ్యా! సీటికీ మాటికీ! యెధవ! యెధవ! అంతారు బాబయ్యా!"

"అబ్బా! అననులేరా! ఆ దెయ్యంతో ఏం సెప్పావో సెప్పు!"

"అమ్మ బాబోయ్! దెయ్యమేటి బాబయ్యా!"

"అరి! నీ! ఆవిడతోరా!"

"అమ్మయ్యా! అదా బాబయ్యా!"

"ఇప్పుడైనా చెప్పరా బాబూ! నీ పుణ్యముంటుంది."

"అదేనండి! బాబయ్యా!"

"ఏమిట్రా?"

"మీరు యింటో నేరని సెప్పమన్నారని సెప్పాను బాబయ్యా!"

"చంపేశావురా! తాతయ్యా!"

"నేదు బాబయ్యా!"

"నీ ముఖం! ఆవిడ ఏమందిరా!"

"తమరు నేచేదాకా, ఆల్లో కూకుంటానంది బాబయ్యా!"

"అయితే! హాల్లో తిష్ఠ వేసిందేమో, చూచి రారా! ఖర్మరా! బాబూ!"

* * *

"ఉన్నాది బాబయ్యా!"

"ఇంకేముందిరా! తా...త...య్యా!"

"ఆఁ!...ఆఁ!...అదేటి బాబయ్యా!"

"..................."

"బాబయ్యా!..."

"..................."

"అదేటి! బాబయ్యా! అలా అయిపోనారు బాబయ్యా!"

"..................."

"బాబయ్యోయ్!...బాబయ్యా!"

"..................."

"అయ్యా! బాబయ్యా!...... మా బాబయ్యోయ్!"

* * *

"ఆవిడ ఏమయిందిరా! తాతయ్యా!"

"అమ్మయ్యా! పోతేపోనాది బాబయ్యా! మీరు నేచారు! ఆ దేముడు చలవ!"

"అబ్బా! ఆవిడ వచ్చి చూసిందిరా!"

"చూసింది బాబయ్యా!"

"ఏమన్నాదిరా!"

"డాటరు బాబయ్యను తీసుకొత్తానని యెల్లింది బాబయ్యా!"

"ఎంతపని చేశావ్రా! తాతయ్యా!"

"నే నేటి చేసాను? బాబయ్యా!"

"ఛీ! నోరు ముయ్యి!"

"చిత్తం బాబయ్యా! మూసేత్తానండి!" ★

# వనితా లోకం

## గాజుగ్లాసు బద్దలై పోయింది

జి. జయప్రద

(చినకొండుకూరు)

తీవ్రంగా వీచిన గాలికి కిటికీ రెక్కలు రెపరెపలాడి కిటికీలో పెట్టిన గ్లాసుని క్రిందికి తోసేశాయి. ఆగ్లాసుకాస్త బండల మీద పడి వేయివక్కలై ఊరుకుంది. ఇంత క్రితం నిక్షేపంలా ఉన్న గ్లాసు క్షణంలో ఎందుకూ పనికిరాకుండా పోయినందుకు ఎవరి ప్రాణమయినా ఉసూరుమంటుంది.

ఇహ ఆ నాడల్లా దాని గురించే బాధ పడ్డాం. ఇలా జరగడం రెండోసారి. గ్లాస్ తాగి కిటికీలో పెడ్తూ అనుకొంది కూడా. "పగిలిపోతుంది. తీసి ఆలమారాలో పెట్టాలి" అని. అలా అనుకొని కూడా తీయలేక పోయింది. ఇది ఆమెలో ఉన్న దౌర్బల్యం. ఇలాగా ఎన్నో పనులు, ఎంతనిగ్రహించుకొందామనుకున్నా జరిగిపోతూనే ఉంటై. సబ్బుపెట్టిలో నిలచిన నీటిని ఎప్పటికప్పుడు పారబోసి పొడిగా ఉంచాలి అని అనుకున్నప్పటికీ సోప్ నీళ్లలో నాని ముద్దవుతూనే ఉంటుంది. వళ్లు తుడుచుకోగా తడైన తువ్వాలును గాలి తగిలేట్టు విప్పి ఆరేయాలనుకొన్నప్పటికీ అది ముద్దగానే ఉండిపోతుంది. మొదట హాయిగానే ఉంటుంది. తీరా మళ్ళీ వాడేప్పుడుగాని దాని సంగతి తెలీదు. ఇలా చేజేతులా చేసుకొని తర్వాత మనమే "అనవసరంగా" అని బాధపడ్తాం. ఇటువంటి అజాగ్రత్తలకి ఎవరికివాళ్లే బాధ్యులుకాబట్టి ఇంకొకళ్ళని అనాల్సిన పనిలేదు. అందుకేనేమో, మనంచేసినపొరపాట్లు కనుక మరింతబాధ.

అదేపని మరొకళ్ళు చేస్తే మనకంత బాధ ఉండదు. ఎటొచ్చీ, చేసిన పొరపాటే మళ్ళీ చేస్తున్నామంటే ఇందుకు ఎంతగానో బాధపడాలి. కేవలం బాధపడీ లాభంలేదు. ఇలాంటి పనులు ఓచెంప చేస్తూ మరోచెంప బాధపడ్డం ఏ విధంగాను అఖండమైన గొప్ప పనికాదు. అది మనలో ఒక సామాన్య దౌర్బల్యంగా మిగిలిపోతుంది. ఇంట్లో వస్తువులపొందికలో ఎక్కడే పొరపాట్లు ఉన్నాయో ఓ కంటమాస్తూ సర్దాలి అనుకుంటూనే అశ్రద్ధ చేస్తాం. ఇలాంటివి ఎప్పటికప్పుడు సర్దే పని మనుషులుంటే బెంగేలేదు. కాని అన్నిటికీ మనమే అయికూడ బద్ధకం వహిస్తే అనక బాధపడేది మనమే.

### "తీరా షాపుకి వెళ్లి..."

'వచ్చేవారం షాపింగ్ చెయ్యాలి' అని వారంరోజుల్నుండీ అనుకుంటూనే ఉంటాం. తీరా రూపాయలు చేతికందగానే చెంగున బజార్న పడతాం. వెనకాముందాలోచించకనే ఏవేవి కొనుక్కోవాలో మొదటే నిర్ణయించుకోకుండా షాప్‌లో అడుగు పెట్టగానే మన మనసు రెపరెపలాడుతుంది. దానితో అనుకోని వేవో నిజమయి ఊరుకుటాయి. అసలు మనకి 'లీకెక్స్ టవల్' ఇష్టం కాని తీరా అక్కడ టర్కీటవల్ కొనేస్తాం. లేకపోతే 'పిల్లోకవర్' కొనబోయి అతల గడా కొలతలు తీసుకోకుండానే అప్పటికప్పుడు ఉజ్జాయింపున కొలత ఊహించి తీసుకొస్తాం. తీరా అది ఇంటికి తెచ్చి తలగడకు తొడిగితే ఎక్కువ అవడమో అసలు చాలక పోవడమో జరిగితే అప్పుడూ ఇలానే "అనవసరంగా" అనుకుంటూ బాధపడ్తాం.

### గాలివాలు

కొందరికి బట్టలమీదగాని మరేవిషయంలోగాని నిర్దిష్టమైన, వ్యక్తిగతమైన అభిప్రాయాలుండవు. ఎవేవో కొనితెస్తారు. ఏ పొరుగింటావిడో వాటిని చూసి పెదమువిరిచి 'ఇది ఇంత ఖరీదు చేస్తుందా? అనవసరంగా ఎక్కువ డబ్బు పెట్టారు' అంటుంది. మన మేమీ స్వతహాగా ఆలోచించలేం. గాలి ఎటువీస్తే అటు మొగుతాయి మన అభిప్రాయాలు. వెంటనే 'నిజమే! ఇది ఇంత ఖరీదు చేస్తుందా? అనవసరంగా బోలెడుడబ్బుపోశాను' అనిపిస్తుంది.

# "పండుగ మర్యాద"

## ★ లసూనా ★

సిద్ధి విఘ్నేశ్వరుని
శుద్ధ చవితిని గొల్వ
ఒద్దికగ నేతెంచె
ముద్దుదీరగ బావ;
చల్లగా రెలదండ
చిన్న మఱదలుగూర్చె
ఉప్పుజేర్చిన దాహ
మెప్పుగానందించి.
నలుగులో నొకయింత
నసిగింది 'దులగొండి'
అవుపంచితే మలర
నయిపోయె పన్నీరు,
అభ్యంగనము లాయె
మధ్యమా బాధలన్
ఆ గణపతికి పూజ
లర్పించి రందరును;
మర్యాదమై మఱది
మక్కువతో ఇచ్చాడు
"ఉండ్రాళ్ళు" గా లేపు
గుండురాళ్ళతో నిండి,

పళ్ళు కటకటలాడ
పకపకానగి రంత
బావముఖమున వేగ
పేలాలు పలుమార్లు:
కొత్తయల్లునిపట్ల
అత్తగారెట్టులో
అవంత దయదలచె
నయిపోయె భోజనాల్;
పెద్దమఱదలు చేతి
ముద్దైన-చిలకలో
సుద్ద యెక్కువ గాగ
చుర్రుమనె నోరంత,
పండుగల మర్యాద
మెండుగా చవిచూచి
రాత్రిగడచునో లేదొ
రభసలేక నటంచు
భయపడుతునే బావ
పడక జేరగబోయె

ఒక్కతెరి నిల్లాలి
మక్కువలసేదిలగ;
మల్లె మొల్లలు నిండ
తెలనా తెల్పాన
ముసుగులో నొకమూర్తి
మునమారగా గాంచి
నక్కుతూ నసుగుతూ
'నాచెలీ' యని జేర
మల్లె మొగ్గలలోని
పల్లేర్లు గుచ్చుకొన
ఎగిరి లేచిన బావ
'నేమినాథా!' యంచు
ముసుగు తీసుక మఱది
మరి పగలబడి నవ్వె
'మగవారితో సరస
మాటేటి మొగుడమ్మ
ఎట్టెట్టు లొంతువో
రట్టులేకను సుమ్మ!"
అని తలుపు చాటున్న
అక్కతో నుడువంగ
మర్యాద చాలంది
మరి, తలుపు వేసింది!

## ★ గాజు గ్లాసు బద్దలైపోయింది ★

అనిపించి ఊరుకుంటుందామరి; ఆ వస్తువు కళ్ళఎదుట ఉన్నన్నాళ్ళు ఈ క్షోభపోదు. అదే ఒక ప్రత్యేకమైన వ్యక్తిత్వం వుండి స్వంతఅభిప్రాయా లుంటే ఎవరేమన్నా మన అభిప్రాయం జోడించి మరీ ఆలోచిస్తాం. మొదట్లో చిన్నచిన్న తప్పిదాలే అయినప్పటికీ కొన్నిరోజులుగా బాధపెట్టిగాని ఊరుకోవు. షాపులో అడుగుపెట్టగానే షాప్ కీపర్ షాపంతా విప్పేసి మనముందు పెడ్తాడు. నిజంగా అందులో ఏదీనచ్చదు. అయినప్పటికీ మొహమాటానికి ఏదో ఒకటి 'నిధి' గా కొనేస్తాం. ఆతర్వాత బాధపడ్డం ఎలాగూ ఉంటుంది.

కొందరికి నాలుగుషాపులు తిరిగి కొనుక్కోడం నచ్చదు. అదేదో చేయరానిపనిగా తోస్తుంది. కొన్నైతే నాలుగు కొందు, మనకి నచ్చింది దొరికేవరకూ జేబురుమాలుకు సైతం పదిషాపులు అయినా తిరగొచ్చు. ఇందులో కించపడాల్సిన అవసరం నాకు కనిపించదు. షాపువాళ్ళదగ్గర మొహమాటానికి గాని, పది షాపులు తిరిగేఓపిక లేక గాని, పదిరోజులు వాడదలుచుకున్న వస్తువుల్ని చులకన చేసి, ఇట్టే కొనేయడం ఏం సబబుగా తోచదు. తృప్తికలిగించేవాటినే కొనుక్కోవాలి.

### బాగున్నా లేకున్నా

కొందరు తెల్లనిమల్లెపూవుల్లాంటిగుడ్డల్లో 'ఫెయిరీ' గా అవుపిస్తారు. మనం కూడా అలా అవుపించాలని అవి కొని తెస్తాం. తీరా అవి కట్టుకొని నిలువుటద్దంముందు నిలుచుంటే ఫెయిరీగా అవుపించటం అటుంచి అసహ్యం అనిపిస్తుంది కొందరు కొన్నితీరుల బట్టల్లో అందంగా అవుపిస్తారు. ఫలానివారు ఫలాని చీరలో బాగున్నారని మనకు బాగున్నా లేకున్నా అదే కట్టేనే? ఎర్రగా గాని, తెల్లగా గాని ఉన్న వాళ్ళకి తెల్లటి బట్టలు బాగుంటాయి. అవే నల్లటివాళ్ళు కడితే వాళ్ల నలుపుని ఇంకొస్త రెట్టింపుచేసి చూపెడ్తాయి. కొన్న ఆ చీర మూలకే వేయాల్సి వస్తుంది. ఇలాంటి వే నచ్చనివి కొన్ని బట్టలు పెట్టె అడుగు భాగాన ఉంటూనే ఉంటై. వాటిని చూసినప్పుడల్లా అనవసరంగా బాధపడ్తాం.

బట్టలు ఉతికేప్పుడుగాని చాకలికి వేసేప్పుడుగాని మొగవారి పిల్లలజేబుల్లో ఏమీ లేకుండా దులిపి చూడాలి. మొగవాళ్ళ జేబుల్లో ఎలాగూ సిగరెట్ పాకెట్ పడి ఉంటుంది. అది తీసేయకుండా అది కొస్తా మరచిపోయి ఉతికితే జేబంతా మరకవుతుంది జేబుల్లోని పొడుం దులిపేయటం ఏమంత పెద్ద కష్టం కాదు. అయినప్పటికీ అది మరచిపోతే ఉత్తపుణ్యానికి ఆపద్దు, తొడుక్కోవడానికి వీలుకాకుండా పాడైపోతుంది. మొదట్లో ఏకొస్త శ్రమతో చక్కబడే పనులయినా మనసులు పాడుచేసుకొనే దాకా చేజేతులా కొనితెచ్చుకుంటాం.

బాత్ రూంలో పాకురుపడితే తేలిగ్గా తీసేయొచ్చు. కాని దురదృష్టం వశాత్తూ కాలుజారి పడితే మాత్రం అంత సులువుగా గాయాలు మానవు! ఓపద్ధతీ, క్రమమూ నియమమూ ఇవి జీవితగమనానికి చక్కటి మార్గాన్ని చూపిస్తాయి. వ్యాసనులలాగే, కష్టాలుకూడా వచ్చాక పరిష్కరించుకోవడానికి అవస్థ పడేబదులు, రాకుండా చేసుకోవడానికి కొద్దిపాటి శ్రద్ధ తీసుకుని, కొంచెం శ్రమపడడం మంచిది. ★

# ★ భార్యలు - భర్తలు ★

సంసారంలో కష్టాలకీ, యిబ్బందులకీ బాధ్యత అంతా భార్యలదే నని అనక్కరలేదు. భర్తల ప్రవర్తన ఆదర్శంగా వున్నదని చెప్పలేము. వారిలో కూడా లోపాలు వున్నాయి.

భర్తలలో అనేకరకాలమంది ఉన్నా, ముఖ్యంగా వేర్కొనతగిన విపరీతపు రకాలు రెండున్నాయి. ఇవి ఉత్తర దక్షిణ ధ్రువాల వంటివి. ఈ రెండురకాలు ఏ పరిస్థితులలోను సమర్థనీయములు కావు.

మొదటిరకం భర్తలకు భార్య గడప దాటటం ఇష్టం వుండదు. అలా ఆమె వెళ్లటమే సంభవిస్తే ఎంతో తలవంపులయేపని జరిగిపోయినట్లు బాధపడతారు. వీరి భార్యలకు, గృహకృత్యాలలో — పిల్లవాడికి ఏ చదువు చెప్పించాలి అన్న దగ్గరనుంచి ఆపూట ఏమివండాలి అనేవరకూ ఏవిధమైన జోక్యం కలగచేసుకునే అవసరంకాని, అవకాశంకాని ఉండదు. కొంతమంది తమ జీతమెంతో కూడా భార్యలకు తెలియనివ్వరు. తక్కువ జీతమైతే ఆమెదృష్టిలో చులకన అవుతామనే భయంకాని, జీతమెక్కువ అయితే భార్య గొంతెమ్మ కోరికలు కోరి డబ్బు దుబారా చేయమంటుందన్న భయం కాని దీనికి కారణంకావచ్చు.

## క్షంతవ్యంకాదు

ఈవిధమైన ప్రవర్తన వివాహమైన క్రొత్తలో కొంతవరకూ (పరస్పరం అర్థం చేసుకోవటం వెంటనే సాధ్యంకాదనుకుంటే) సమర్థనీయమౌతుందేమో కాని తరువాతమాత్రం క్షమించరాని నేరమే అవుతుంది. భార్య పుట్టిపెరిగిన మనుష్యులను, పరిసరాలను వదలి తనకొక ఇల్లు, ఆ యింట్లో ఒక స్థానం ఏర్పరచుకుని, గృహయజమాని (భర్త) కష్టసుఖాలలో భాగం పంచుకోవాలనే సదుద్దేశంతో, ఆశతో వస్తుంది. భర్త తన కష్టసుఖాలు, జీవితపు రహస్యాలు ఆమెకు తెలియచేయటం అత్యవసరం. ముఖ్యంగా భర్త ఆర్థికస్తోమతెంతో భార్యకు తెలియాలి. అపుడే ఆమె తన కోరికలను అదుపులో పెటుకుని ఆదాయవ్యయములను సమన్వయ పరచుకో గలుగుతుంది.

## "మీరు అడుగరాదు; మేము చెప్పరాదు"

కొంతమందికి తమ ఆదాయం తక్కువ అని భార్యకు తెలిస్తే ఆమె పుట్టింటి వారికి చెప్తుందని, అందువల్ల వారిలో తన గౌరవం తగ్గిపోతుందని భయపడతారు. కాని ఇంగిత జ్ఞానంకల ఏ భార్యా అలా చేయదు. భర్త ఎదుట పుట్టింటివారిని వెనక వేసుకొచ్చి మాట్లాడినా, తీరా పుట్టింట్లో మా యిల్లు, మా కుటుంబం అంటూ అత్తింటి గొప్పతే చెప్తుంది. ఆమె రెండు పక్షాలయందు సమాన అభిమానంతో వుండటంవలన ఏఒకరికిబాధకలగకుండా ఉండేట్లు చేస్తుంది. ఇక్కడ అసందర్భ మనిపించినా ఒక విషయం చెప్పాలి. ఈ రోజుల్లోకూడా చాలామంది ఎవరినైనా చూడగానే "నీ జీతమెంత? ఏమి ఉద్యోగం? ప్రమోషన్లేమైనా వుంటాయా?" అని ఒక ప్రశ్నల వర్షం కురిపిస్తారు. ఈ మాదిరి కుశల ప్రశ్నలు పూర్వకాలంలో మర్యాదగా భావించేవారు. కాని నేటి సంఘంలో అడుగకూడని ప్రశ్నలలో మొదటివి. "మీదే కులం? మీ జీతమెంత?" అని, ఈ ప్రశ్నలు అడిగేవారికి రెండవవారియందు సానుభూతి వుంటుందనుకోవటం పొరబాటు. కేవలం కొంత సమాచారాలు పోగుచేసుకునేందుకే అడుగుతారు. అటువంటి వారి దగ్గర జీతాన్ని గురించి, ఆర్థిక స్థితినిగురించి నిజంచెప్ప నక్కరలేదు. భార్యలుకూడా యీ ప్రశ్న ఎవరైనా అడిగినప్పుడు, చెప్పితే గొప్పగా వుండేటంత జీతమైతే తప్ప, 'నాకు తెలియ'దని హాయిగా అబద్ధం ఆడేయవచ్చు. ఒకరి గౌరవాన్ని ఒకరు కాపాడుట మన్నమాట.

సుతుసుమల్లి సుశీల

ఇలా తమ ఆర్థికస్థితి చుట్టాలకు కనీసం భార్యకు కూడా తెలియనీయక, లేనిపోని గొప్పలకుపోయి అప్పులుచేసిన భర్తల మూలంగా విచ్ఛిన్నమైన సంసారాలెన్నో వున్నాయి. తరువాత ఎంత పశ్చాత్తాపపడి ఏమిప్రయోజనం?

## చనువు, అలుసు

మరికొందరు; భార్యకు చనువిస్తే అలుసు చేస్తుందని, సరిగా మాటైనా మాట్లాడక

# ★ భార్యలు - భర్తలు ★

ఎప్పుడూ ఏదో ఒక కారణంతో చిరచిరలాడుతూ వుంటారు. చేసినపనులేవీ గుర్తించక మరచిపోయిన ఏఒక్క పనినో పట్టుకుని సాధిస్తుంటారు. ఈవిధమైన ప్రవర్తనవల్ల గౌరవం పెరగకపోగా, ఆ వ్యక్తియందు మొదట్లో భయం, తరువాత విహ్వభావం సంసారంమీద విరక్తి కలుగుతుంది. ఈవిరక్తి అనేక అరిష్టాలకి దారి తీయవచ్చు. సంసారంలో శాంతి పూర్తిగా నశిస్తుంది.

ఉద్యోగంచేసే స్త్రీలని మినహాయిస్తే మిగిలిన వారి ప్రపంచమంతా నాలుగు గోడల మధ్యనే కాబట్టి ఆమెకు సంసారమందు విసుగూ, చిరాకూ, క్రమేపీ విరక్తీ కలగకుండా చేయటం ఎంతైనా అవసరం. బాహ్యప్రపంచంలోని సౌఖ్యాలలో, వినోదాలలో పాల్గొనే అవకాశం కల్గించటం భర్తవిధి. ఉదాహరణకి, క్రొత్త సినీమా రాగానే స్నేహితులతో వెళ్ళి చూసివచ్చే బదులు భార్యకి వీలైనపుడు ఆమెనుకూడా తీసుకువెళ్ళితే, ఆమె గృహనిర్వహణలో తానుపడినశ్రమ నంతా మరచిపోయి, భర్తకు తనయందు గల శ్రద్ధను ఆదరణనే స్మరిస్తూ వుంటుంది. అలాగే ఆమెకో చీర కావాలంటే ఏదో తెచ్చి పడవేయటమో లేక నీవే వెళ్ళి కొనుక్కోమనటమో చేసేబదులు తనుకూడా వెళ్ళి కొనిపెడితే ఎంతో తృప్తి పొందుతుంది. వెళ్ళినచోటికల్లా భార్యను వెంటబెట్టుకెళ్ళాలని కాదుకాని తానొక సంసారిననీ, తన రాకకోసం, తనతో కబుర్ల కోసం ఎదురుచూచే భార్యా బిడ్డలు ఇంట్లో వున్నారనీ భర్తలు మరచిపోకూడదు.

## "వహ ఆవిడ వత్తి బైతు!"

ఒకరకం వారు తమ భార్యలని యితరులకి పరిచయంచేస్తూ "ఏమీ తెలియదండి. వట్టి Country brute (పల్లెటూరి గొడ్డు)" అనీ ఇలాంటి ఇతర మాటలు అంటారు. అవతలి వారు అప్పటివరకు మాట్లాడక వూరుకున్నా, తరువాతనైనా అతని ప్రవర్తనని గర్హిస్తారు. అలా ప్రతివారిముందు ఆమెను అవమాన పరిచేబదులు, తన హోదాకీ అంతస్థుకీ తగినట్లు నాగరీకమైన వేషభాషలు నేర్పితే ఎంత బాగుంటుంది.?

భర్త చదువుకున్నవాడై భార్య చదువుకోనిదైతే సహృదయుడైన భర్త ఆమెకు విజ్ఞానం కలిగించేందుకు ప్రయత్నిస్తాడు. కొందరు తమ భార్యను చదువుకున్న స్నేహితుల ఇళ్ళకి ఎలా తీసుకు వెళ్ళడం? ఎలా పరిచయం చేయటం అని కష్టపడతారు. కేవలం స్కూలు చదువు, పరీక్షలు లేకపోయినా ఎటువంటి శుద్ధమొద్దునైనా రెండు సంవత్సరాలలో విజ్ఞానవంతురాలిని చేయవచ్చు. 5, 6 క్లాసులు చదివి పెండ్లి చేసుకుని భర్త సహకారంతో డిగ్రీలు తీసుకున్న వనిత లెందరో వున్నారు. అయినా డిగ్రీలు విజ్ఞానానికి కొలబద్దలా?

చాలా మంది పురుషులకు ఈ రోజుల్లో కూడా తమభార్యలు బయటకు వెళ్ళడం ఇష్టం వుండదు. కాని సమర్థురాండ్రైన ఇతర స్త్రీల ముందు మాత్రం తమ భార్యలను హేళనచేసి అవమానం చేస్తారు. "ఆమె చూడు ఫలానా పని ఎంత తెలివిగా చేశారో. నువ్వు ఆఖరికి ఒంటరిగా ప్రయాణమన్నా చేయగలవా? ప్రక్కస్టేషను కెళ్ళాలంటే పదిమంది సాయం పట్టాలి" ఇలా వేళాకోళం చేస్తారు. నిజానికి తా మెప్పుడైనా ఆమె తెలివి తేటలు చూపించేందుకు అవకాశం ఇచ్చారా అని ఒకసారైనా ఆలోచించరు.

ఈ విధమైన మాటలవల వీరి భార్యలకు పరాయిస్త్రీ ఎదుట తనను భర్త కించపరచాడనే అవమానం, క్రమంగా రెండో ఆమె పట్ల ఈర్ష్యగా ఆపైన ద్వేషంగా మారుతుంది. అసలు అలా ధైర్యంగా వుండటమే ఒక అవలక్షణమైనట్లు, భావించి నచ్చచెప్పుకుని అలాంటి వారిని గురించి "మొగరాయుళ్ళని, సిగ్గు, లజ్జ విడిచేశార"ని ప్రచారం చేస్తారు.

## కారణజన్ములు

దీనికి పూర్తిగా వ్యతిరేక పద్ధతిలో వుంటారు కొందరు భర్తలు. వారు కేవలం ఆఫీసుకి వెళ్ళిరావటానికే పుట్టినట్లు, మిగతా యే విషయాలలోను తమకు జోక్యం లేదనుకుంటారు. డబ్బు సంపాదించడంతో తమ బాధ్యత తీరిపోయినట్లు, మిగతా అన్ని బాధ్యతలు వహించవలసిన విధి భార్యలదే నన్నట్లు ప్రవర్తిస్తారు. "నాచేతనయింది సంపాదించుకు వస్తాను. ఆపైన నీ యిష్టం. నన్ను పలకరించకు." అంటూ హాయిగా ఏ పేపరు చదవటంలోనో నిమగ్నులవుతారు. వీరి భార్యలు ఇంటా బయటా అన్ని పనులూ నిర్వహించుకోవలసిందే. అంతే కాదు. వీరు తమ భర్తల ఆఫీసు కాగితాలు మొదలు, వారికి బట్టలు కొనటం వరకూ స్వయంగా చూడాలి.

ప్రొద్దున్నే గడ్డం చేసుకోబోతూ "నిన్న బజారు కెళ్ళావుకాబోలు. బ్లేడ్సు ఏమైనా తెచ్చావా?" అంటే ఎలావుంటుంది ఏ కాలర్ బటనో, చేతిగుండీలో అయితే పరవాలేదు. కాని, ఏస్త్రీ అయినా బజారుకివెళ్ళి ఒకపాకెట్ బ్లేడ్సు ఇవ్వండి అంటే ఎంత హాస్యాస్పదంగా వుంటుంది! ఇలాంటి వారు నిజంగా వున్నారా అనకండి. ఉన్నారు-భర్తపడే శ్రమనుగుర్తించి, దానిని తగ్గించేందుకు ఏస్త్రీ అయినా పాటుపడవచ్చు. కాని ఆమెను ఒక గుమాస్తాలా, యంత్రంలా చూడటం తప్పు.

"10 గంటలకు నేనువెళ్ళితే నాలుగు గంటలవరకూ ఏమి చేస్తావు? ఈ కాస్తపని చేయలేవా? "అంటే ఆమె మంచితనాన్ని లోకువ కట్టి, అలుసు తీసుకుని అన్యాయంగా సాధించి బాధపెట్టడమే అవుతుంది.

## (అలాటి) గృహమే కదా...

సంసారమొక సహకార సంస్థవంటిది. భార్యాభర్తల పరస్పర సహకారం మీదే ఆ సంస్థ జయాపజయాలు ఆధారపడి వుంటాయి. అందులో ఇరువురికీ సమాన హక్కులూ బాధ్యతలూ వుంటాయి. ఒకరినొకరు గౌరవించుకుంటూ ఒకరిశ్రమ నొకరు గుర్తించే భార్యాభర్తలుండే గృహమే స్వర్గసీమ. అలాలేని దేమిటో మీకు తెలుసుగా!



## గృహవైద్యం:

# తులసి

ఇది మన అందరి ఇళ్ళల్లో సాధారణంగా ఉంటుంది. తులసిలో కూడా చాలా రకాలు వున్నాయి. దీనిని సంస్కృతంలో శ్వేతతులసి, అర్జక, శితార్జక అని కూడా అంటారు. దీన్ని మనము లక్ష్మీతులసి అని అంటాము. ఇది హిందూదేశంలో అన్ని చోట్లా పెరిగే చెట్టు. దీనిలో అనేకజాతులు వున్నాయి. భూ తులసి, వన తులసి, కృష్ణ తులసి, రామతులసి అని. కృష్ణతులసిని

సి. హెచ్. సావిత్రి

సంస్కృతములో మంజరీ, విష్ణువల్లభ అని అంటారు. దీని ఆకులు, కొమ్మలు నల్లగా వుంటాయి. హిందువులు, తమ ఇళ్ళలో ఏ చెట్టు వేసినా, వేయకపోయినా, తులసి చెట్టుమాత్రము తప్పకుండా వేస్తారు. తరుచూ మనవాళ్ళు ఏదో ఒకప్పుడు ఒక చెంబెడు నీళ్ళు పోసి, దణ్ణముపెట్టి, ఒక ఆకు కోసి నోట్లో వేసుకుంటారుకూడా. ఒంటికి మంచి దనికూడా అలా చేస్తారేమో!

తులసిచెట్టుగాలి మన ఒంటికి చాలా మంచిది. ఈ చెట్టు మనం పూజచేసుకునేందుకు ముఖ్యంగా వేసుకుంటాము. పిల్లలకి, పెద్దవాళ్ళకికూడా చిన్న చిన్న చికిత్సలకు ఈ తులసిచెట్టు మనకు ఉపయోగపడుతుంది. పిల్లలకు అప్పుడప్పుడు కడుపునొప్పి, ఆకలి లేకపోవడం మొదలయినవి కలుగుతూ వుంటాయి. చిన్న చిన్న వాటన్నిటికీ డాక్టరు దగ్గరకు వెళ్ళనక్కరలేకుండా, మనమే ఇంట్లోనే కొన్ని చికిత్సలు చేసుకోవచ్చును. ఇప్పుడు తులసిఆకుతో కొన్ని ఉపయోగాలు చెప్తాను. తులసి ఆకు రసం తీసి, దానిలో తేనె కలిపి పిల్లలకు ఇస్తే బాగా ఆకలి పుట్టుతుంది. జీర్ణశక్తిని కలిగిస్తుంది. ఇంకా దగ్గుకూడా తగ్గిపోతుంది.

తులసిఆకురసంలో శొంఠి పొడి కలిపి పిల్లలకు ఇస్తే, కడుపునొప్పి తగ్గిపోతుంది. తులసి ఆకు నలిచి ఆముద్ద చెవిలో పెట్టుకుంటే చెవిపోటు తగ్గుతుంది. ఇది చెముడుకుకూడా మంచిది. తులసి ఆకు కషాయం కాచి, దీనిలో మిరియాలపొడి కలిపి త్రాగితే మామూలు జ్వరం తగ్గిపోతుంది.

తులసి ఆకు బాగా నలిపి ముక్కు దగ్గర పెట్టుకుని వాసనచూస్తే జలుబు తగిపోతుంది

తులసి ఆకు రసము కళ్ళల్లో వేసుకుంటే నీరు కారడం తగ్గిపోతుంది. ఇంకా చూపు కూడా బలపరుస్తుంది.

### మందారనూనె

త్రవ్వ, పప్పు నూనిగాని కొబ్బరినూనె కాని కుంపటిమీద ఒక గిన్నెలోపోసి పెట్టి అది మరుగుచుండగా నాలుగు ముద్ద మందారపూలు ఒక వల్ల జీడిగింజ కొట్టివేసి 5 నిమిషాలు మరగనిచ్చి దించి వడకట్టి చల్లారిన తరువాత ఒక సీసాలో పోసుకొనవలెను. కావలసిన వారు సువాసనకు ఏమైనా పరిమళద్రవ్యాలు కలుపుకొనవచ్చును.

ఇది వాడితే జుట్టు నెరయుట, వూడుట వుండవు. ఎరుపుగావున్న జుట్టు నల్లపడుతుంది. తలకట్టుకూడా పెరుగుతుంది. ఇది స్వానుభవం.

కూచిమంచి సరోజిని, కాకినాడ

తులసి ఆకు కషాయం, జాజికాయ చూర్ణం కలిపి పిల్లలకు ఇస్తే భేదులు కట్టిపోతాయి.

తులసి వేరు కషాయం కాచి, పిల్లలచేత త్రాగిస్తే, మలబద్ధకము పోయి, శుభ్రంగా విరేచనం అవుతుంది.

ఉదయాన లేవగానే, తులసి ఆకు నమిలి పండ్లకు బాగా రుద్దితే పండ్ల నొప్పులు తగ్గిపోతాయి.

తులసి ఆకులతో తొమ్మిది మిరియాలు చేర్చి తింటే, శీతజ్వరం (చలిజ్వరం) తగ్గిపోతుంది.

తులసి ఆకు వాడుతూ వచ్చిన తర్వాత తేలుకుట్టినట్లయితే విషము ఎక్కదు. ★

## వంటలు:

# సగ్గుబియ్యంతో వడియాలు

సగ్గుబియ్యం ఒక సవాశేరు తెచ్చి వాటిలో బెడ్డలు వగైరా ఏరివేసి ఒక గ్లాసుతో కాని ఒకచిన్న గిన్నెతో గాని కొలుచుకొని వాటిని ఒక పళ్ళెములో పోయవలెను. తరువాత పొయ్యిమీద ఒకస్టీలు గిన్నెలో కాని లేక ఒక ఇత్తడి గిన్నెలో గాని సగ్గుబియ్యము కొలిచిన దానితో 8 గ్లాసులు నీరుపోసి కాగపెట్టవలెను. ఆ నీరు కాగుచుండగా నాలుగు తులములు పచ్చిమిరపకాయలు, రెండు తులముల ఉప్పు, ఒక చెంచాడు జీలకర్ర రుబ్బురోటిలో వేసి దంచి, మెత్తగా నలిగిన ముద్దను ఆ నీటిలో వేయవలెను. కళ పెళగా కాగినతరువాత పళ్లెములో ఉన్న సగ్గుబియ్యమును ఆగిన్నెలో పోయవలెను. అవి ఉడుకుచుండగా ఒక ఇత్తడి గరిటెతో కలుపుచుండవలెను. కలుపకపోయినచో అడుగంటును. అది గరిటజారుగా ఉన్నప్పుడు దింపవలెను. దించిన తరువాత ఒక గంటవరకు దానిని చల్లారనివ్వవలెను. ఒక నులకమంచము మీద లేక పట్టెమంచము మీద తడిపిన గుడ్డనొకదానిని ముడుతలు లేకుండా పరచవలెను. ఆ ఉడికిన సగ్గుబియ్యమును ఈ తడిబట్టమీద ఒక చెంచాతో తీసి వడియాలు పెట్టినట్లు ఒక రూపాయిబిళ్ళయంత గొప్పవి పెట్టవలెను. ఇవి ఎండ పెట్టవలెను. ఆ సాయంకాలము గుడ్డను యింట్లోకి తెచ్చి ఆమరునాడు గుడ్డ వెనుకవైపున చన్నీళ్లు తడి వేయుచు ఒక్కొక్క వడియము జాగ్రత్తగా తీయవలెను. నీళ్ళతో తడపనిచో సగ్గుబియ్యము జిగురు కలది ఊడిరావు. అవి అన్ని తీసినతరువాత చేటలో పోసి ఎండపెట్టవలెను. వీటిని వేయించుకొని తిన్నచో బహు బాగుగా నుండును. లంఘనములు చేసినవారు కూడ తినవచ్చును. ఇవి వేసవికాలములో మధ్యాహ్నము ఫలహారముగా, కూడ తినవచ్చును.

ఎస్. కె. లక్ష్మీకాంతం
(సీ గా ల)



* * *

## సగ్గుబియ్యం ఉప్మా

కావల్సిన సామాన్లు: పావుశేరు సగ్గుబియ్యం పావుశేరు పెసరపప్పు, ఒకటేబుల్‌స్పూన్ శెనగపప్పు, ఒకటిస్పూన్ మినప్పప్పు, తగినంత పుల్ల మజ్జిగ, తగినన్ని పచ్చి మిర్చి అల్లం ఒక టేబుల్ స్పూన్ ఆవాలు, కొద్ది కరివేపాకు, చిన్న నేతిగిన్నెడు నెయ్యి ఒకపచ్చి కొబ్బరి చిప్ప.

ఉప్పిండిచేసే ముందు, మజ్జిగలో సగ్గుబియ్యం నానపెట్టవలెను. మజ్జిగ తగినంత అనగా తడిసేటు మాత్రం ఉంచవలెను. లేక మజ్జిగ ఎక్కువైన ముద్ద అగును తక్కువైన నానదు కొంచెం తగినట్లుగా ఉంచవలెను. సగ్గుబియ్యం అరగంట అయ్యేసరికి నాని మజ్జిగను పీల్చుకొని పొడిగా ఉంటాయి. ఈ లోపుగా కుంపటిమీద గిన్నె కొలేసి పావుశేరునీళ్ళుపోసి మరిగాక, పెసర పప్పుపోసి కలయబెట్టి మూతపెట్టవలెను కొంచెం ఉడికాక బిగుసుగానే నీళ్ళు వంచేసి పప్పు ఓపెనివ్వాలి. కొబ్బరిచిప్ప కోరి పెట్టుకోవాలి. పచ్చిమిర్చి, అల్లం సన్నగా ముక్కలు తరిగి పెట్టుకోవాలి. అప్పుడు కుంపటిమీద బాణలి పెట్టి చిన్న నేతిగిన్నెడు నెయ్యిపోసి మరిగాక శెనగపప్పు, మినపప్పువేసి ఎర్రగా వేగాక అల్లం పచ్చిమిర్చి ముక్కలువేసి వేగనిచ్చి ఆవాలు కరివేపాకు వేసి చిటపట్లాడాక నానిన సగ్గుబియ్యం (నానపెట్టేటప్పుడే, తగినంత ఉప్పు వేయవలెను) వేసి వేయించవలెను కొబ్బరి కూడా వేసి ఉడికిన పెసరపప్పు వేసి కలిపి 5 నిముషాలుంచి దింపవలెను కావల్సినవారు నిమ్మకాయ పిండుకోవచ్చు (సగ్గుబియ్యం వేగి గుళ్లులా తేలాయి).

* * *

## సగ్గుబియ్యం చట్నీ

కావలసిన సరకులు పావుశేరు పెరుగు నవటాకు సగ్గుబియ్యం, ఒక టేబుల్ స్పూన్ ఆవాలు, ఐదు పచ్చిమిరపకాయలు, ఒక టేబుల్ స్పూన్ మినప్పప్పు కొంచెం కరివేపాకు.

చేయువిధము: గట్టిపెరుగు తీసుకొని దానిలో తగినంత ఉప్పువేసి తరిగిన పచ్చిమిరపకాయ ముక్కలు వేసి పెట్టుకోవలెను. బాణలి కుంపటిమీద పెట్టి రెండుస్పూన్ల, నెయ్యి వేసి సగ్గుబియ్యం ఎర్రగా వేయించి పెరుగులో పోయాలి తిరిగి బాణలిలో రెండు స్పూనుల నెయ్యి వేసి మరిగాక మినపప్పు వేసి ఎర్రగా వేగాక ఆవాలు కరివేపాకు వేసి చిటపట్లాడాక పెరుగులోపోసి కలపవలెను. పులుపు కావల్సినవారు పుల్లపెరుగువాడవచ్చు చేయుట సులభం. ఈ పచ్చడి చాలా రుచిగా ఉంటుంది.

కె. పార్వతీదేవి (చిత్తూరు)

## వాడెవడు?

పల్లెటూరి ఆసామీ బస్తీ వచ్చి తన కొడుకు చదువుకుంటున్న కాలేజీకి వెళ్ళాడు. లాబొరేటరీలో ఏదో పరిశోధన చేస్తున్నాడు అతని కొడుకు.

"ఒరే అబ్బాయి, ఏమిట్రా చేస్తున్నావ్?" అని తండ్రి అడిగాడు.

"ఏంలేదు నాన్నా! సర్వ ద్రవీకరణ రసాయనం కనిపెట్టడానికి ప్రయత్నిస్తున్నాము" అన్నాడు కొడుకు.

"వాడెవడు?" అన్నాడు తండ్రి.

"వాడు కాదు నాన్నా, అది. అదొక రకం అరఖు. ఆ అరఖు దేనిమీద వేస్తే అదల్లా కరిగిపోతుంది."

"అదా? బాగానే ఉంది గాని, మరి దాన్ని తయారుచేసిన తరవాత దేంట్లో పోస్తార్రా, తెలియక అడుగుతాను?" అన్నాడు పల్లెటూరి ఆసామీ.

# ★ సలహాలు ★

ఒకరికి అవసరసమయాల్లో సలహాలివ్వటం, మన అవసరసమయాల్లో ఎదుటివారి సలహాలను పొందటమూ మానవధర్మం. ఎదుటివారి సలహాలు, తోడ్పాటు లేకుండా ఎవ్వరూ సంఘంలో జీవించలేరు. ఈవిధంగా సలహాలిచ్చిపుచ్చుకోవటంలో వ్యక్తిత్వపు మర్యాదను పొందటమే గాకుండా, కొంతవరకు శాంతోపశమనాన్ని కూడా పొందవచ్చు.

కానీ, 'సలహాలు' అనేవి ఎటువంటప్పుడు ఇవ్వాలి? మన సలహాలు ఎటువంటివిగా వుండాలి? ఎంతవరకు మనం ఇతరులకు సలహాలివ్వగలం?

అవతలివారు అవసరంలో వుండి మన సలహాలకోసం నిరీక్షించినప్పుడు మనం మనకు తోచిన సలహాలివ్వటంలో తప్పేమీ లేదు. అది చాలా మంచిపద్ధతికూడా.

ఎటొచ్చీ అయినవాటికీ, కానివాటికీ కల్పించుకుని 'ఉప్పులో నేనే, పప్పులో నేనే'నంటూ కల్పించుకుని తమ అమూల్యమైన సలహాలతో దంపతులమధ్యా, అత్తాకోడళ్ళమధ్యా, తోడికోడళ్ళమధ్యా పొరపులు పుట్టించి వినోదాన్ని తిలకిస్తూవుండే వాళ్ళతోనే వుంది తంటాఅంతా!

ఈ 'కలహప్రియులు' ఇతరులకు అవసరమైనప్పుడు పనికివచ్చే సలహాలనుమాత్రం ఇవ్వలేరు. ఎంతకీ కొంపల్లో నిప్పురాజెయ్యటానికిమాత్రం [illegible].

ఒక ఎల్లమ్మ వుంది! ఆ ఎల్లమ్మ పెద్ద అత్తగారైన పుల్లమ్మదగ్గరికొచ్చి "అదేమిటమ్మా! వదినా! కోడలు వచ్చినతర్వాత కూడా నీకీ వంటగీత తప్పదా ఏం? కోడలికి చెప్పి చేయించాలిగానీ, ఈ పెద్దతనంలో కూడా (ఆవిడకు వలభైయేళ్ళుఅయినా పెద్దతనంకింద లెక్కలెండి) వంటపాత్రయేమిటా! మన ఈడువాళ్ళంతా సుఖంగా కూర్చుని కబుర్లాడుకోవలసినరోజులివి... నేను చూడు! మా కోడలిచేత ఒక్కొక్కపనే తప్పగించా. అదికూడా 'తగు,' 'కాదు' అనకుండా ఎంతమందికైనా వండిపెడుతోంది... వెళ్ళొస్తానమ్మా! పనుంది!" అంటూ ఓ పుల్లెక్కిచ్చి లేస్తుంది. మరో పొరుగింటి పెత్తనానికి.

ఆ పుల్లమ్మత్తే కొంచెం మంచిమనిషైతే 'ఫరవాలేదులే వదినా! పెద్దవాళ్ళం మనం కూర్చుని చిన్నవాళ్ళచేత చేయించటమేమిటి." అంటుంది. లేక ఆవిడే గనుక ఎల్లమ్మత్తలాంటిదే అయితే కేవలం లోకం కోసం కొత్తకోడలిచేత తక్కినపనంతా చేయించినా వంటమాత్రం చేయించటానికి భయపడుతుంది. అటువంటి సమయంలో ఎల్లమ్మత్త సలహాతో ఆ కాస్తాభయంకూడా పోయి, కోడలికి వంటయింటి పైత్తనం వప్పగించి తాను పొరుగింటి పెత్తనాలు సాగిస్తుంది. కొత్తకోడలికి వంటచెయ్యటం గిటదు. కోడలు వంటపని సరిగా చెయ్యకపోతే అత్తగారికి కోపం. ఇదీ ఆ కుటుంబ కలహానికి నాంది!

ఇంకోరకంమనుష్యులున్నారు. వీరుకొత్తగా కాపురానికొచ్చిన పిల్లదగ్గరికొచ్చి పరామర్శి

## సి. కృష్ణకుమారి

స్తుంటారు. "ఏమ్మా! నీభర్తజీతం రాగానే నీకిస్తాడా లేదా?" అని ప్రశ్నించటం, ఆ పైన భర్తజీతంపైన సర్వహక్కులుభార్యవేననీ, ఆ అధికారం సంపాదించటం మహాఘనమని, ఆ విధమైన అధికారం లభించటం పగ్రప్రసాదమనీ వ్యాఖ్యానించి మరీవెళ్తారు. ఈ విధమైనసలహా మరీఘోరం! ఎందుకంటే అది భార్యాభర్తల స్వవిషయం. అవసరం లేకపోయినా అందులోకల్పించుకుని ఆ పిల్ల హృదయంలో 'తుపాను' రేపుతారు.

అలాగాకుండా, "చూడమ్మా! మనం డబ్బువిలువ తెలుసుకుని మరీఖర్చు చెయ్యాలి. అనవసరమైనఖర్చులు తగ్గించిఆడబ్బుపొదుపు చెయ్యాలి నీ తెలివితేటలవల్ల మీ ఆయనకూడా డబ్బుపొదుపుగా వాడేటట్లు చెయ్యి" అని సలహాలిచ్చే పరహితాభిలాషి, అనుభవంగల గృహిణి సలహాఫలితం చూడండి! పై ఆవిడసలహా ఫలితం చూడండి! ఎంత తేడాగావుంటుందో.

ఇక తోడికోడళ్ళ మధ్య రేపే కలతలు వెయ్యివిధాలుగా వుంటాయి. 'పాల' అవసరంకొద్దీ పక్కింటికొచ్చిన గృహిణి ఒకామె ఆ యింటిరెండోకోడలు గేదెకు కుడితి పెడ్తూండటం చూస్తుంది. అప్పుడు ఆపాలకోసంవచ్చిన గృహిణి "అయ్యో! నాతల్లీ! ఇదేంపోద్యం! రోజూచూస్తూనేవున్నాగా! రోజూ నువ్వే ఈ గేదెదగ్గర పనిచూడాలా! ఆ పెద్దకోడలు కర్రపెత్తనం చెయ్యటంతప్ప పనేముట్టదు. నే చూస్తున్నాగా!" అంటుంది ఈమెమీద ఎంతో ప్రేమ వొలకబోస్తూ.

ఈమె స్వభావం తెలిసిన కోడలైతే, 'ఫరవాలేదండీ పిన్నిగారూ! మాఅక్క వంటయింటిపని చూస్తున్నదిగా! ఒకరం వంటయింటిపనిచూస్తే, ఇంకొకరం గేదెదగ్గర పనిచూస్తాం!' అంటుంది ఆమె చెంపను ఛళ్ళుమనిపించినట్లు. అదే అమాయకురాలైన కోడలయితే 'ఈకలహప్రియ' భావం అర్థంచేసుకోలేక ఇంటిగుట్టు రచ్చకెక్కిస్తుంది.

తీరికసమయం స్త్రీలకు ఎక్కువ. ఆతీరికసమయాన్నికూడా సద్వినియోగపరచేవారున్నారనుకోండి! కానీ! ఆ తక్కినవారిమాటే మనం చెప్పటం లేదు

తీరిగ్గా పెత్తనాలుసాగిస్తూ, ఇక్కడిమాట అక్కడా, అక్కడిమాట ఇక్కడా చెప్పటం, అందరికీ తనేసలహాలు చెప్పాలనీ, అందరూతనదగ్గరికే సలహాలకి రావాలనీ, అందరిమధ్యా తనే గొప్పఅనిపించుకోవాలనీ తాపత్రయపడేవాళ్ళని ఎంతోమందిని చూశాను. ఈ విధమైన తాపత్రయం కలవారిని

### ★ నేరేడుపండ్ల రసము ★

ఈరోజుల్లో నేరేడుపండ్లు చెట్లక్రింద రాశిగా రాలిఉంటవి. వీటిని చాలమంది లెక్కచేయరు. గాని వీటితో చేసిన జూస్ చాల మంచిది. చెట్లక్రింద నాపలుగాని గుడ్డలుగాని పరిచి పండ్లు గులుపుకొని శుభ్రమైన పండ్లు ఏరి తీసుకొనవచ్చు.

ఈ పండ్లు అరసేరు తీసుకొని వీటిలో ఒక గిద్ద నీళ్ళుకుపోసి పొయ్యిమీద పెట్టాలి. ఏలకులు, లవంగమొగ్గలు పొడిచేసి దానిలో వేయాలి. 5 నిముషాలు పొయ్యిమీద ఉంచి దించాలి. ఆనక పండ్లను చేత్తో పిసికి, రసముపిండి పిప్పిని పారవేయవలెను. మిగిలిన రసములో తొక్కలు లేకుండా వడపోసి తగుమాత్రముగా చక్కెరకలిపి ఒక సీసాలో దాచుకొని ప్రతిరోజు భోజనము తర్వాత 1-2 ఔన్సులు త్రాగిన మంచిది. జీర్ణానికి మంచిది. విరోచనకారి. రక్తవృద్ధి కలిగిస్తుంది. ఇది 4, 5 రోజులు నిలువ ఉంటుంది. అయిపోతే మరల చేసుకొని దీన్ని కొన్నాళ్ళు సేవించుట మంచిది.

ఎ. చంద్ర, తెనాలి.



# సలహాలు



చూస్తుంటే జాలీ, నవ్వూ కూడా వస్తూ వుంటుంది.

మాకు తెలిసిన ఒకామె వున్నారు. ఆమె వంటరిది. ఆ వున్న ఒక్క కూతురు కాపురానికి వెళ్ళిపోయింది. ఇంకేం! ఈమెకు చక్కటి తీరిక సమయం! ఉదయం ఏడింటికే లేచి పని ప్రారంభిస్తుంది. మాపటికి కూడా అన్నం అప్పుడే వండేస్తుంది. ఎనిమిదింటికల్లా భోజనంతో సహా సమంతా పూర్తయిపోతుంది. ఇక విహారానికి బయల్దేరుతుంది. ఏ బాదరబందీ లేని ఈమెకు పని అయిపోయిందని అందరిళ్ళల్లోనూ ఎనిమిదింటికే పని అయిపోతుందా? పని కాలేదు వెళ్ళమనలేము! రావద్దనటానికి వీలులేదు. పనీ కాదు. నానా అవస్థ పడాల్సి వస్తుంది. సాయంత్రం ఆరింటిదాకా ఆమె ఇరుగు పొరుగుల ఇళ్ళల్లోనే - వుంటుంది.

పోనీ, అందరి యిళ్ళకు అట్లా తిరుగుతుంటే వాళ్ళమీద 'అభిమానం' అన్నా వుంచుతుందా అంటే అదిలేదు. పోనీలే పాపం! తోడులేని మనిషి కదా అని మేమంతా అప్పుడప్పుడూ చేసుకున్న 'టిఫిన్' అది పెగొండేవాళ్ళం. పచ్చిమిర్చి ముక్క అయినా మిగల్చకుండా తిని ఆఖరికి 'కొత్తిమీరవాసన ఎక్కువై వెగటుగా వుందనో, కారం ఎక్కువయిందనో, ఉప్పు ఎక్కువయిందనో చెప్పి తనకు రుచిగా లేదని తేల్చేసేది. మాకెవ్వరికీ కనిపించని లోపం ఈవిడ కెట్లా కనిపించిందా అని మేము ఆశ్చర్యపోయేవాళ్ళం.

అవి ఆవకాయపెట్టిన కొత్తరోజులు. మేము మా ఇరుగుపొరుగుల్తోపాటు ఆమెకు కూడా 'రుచి'కి పంపాము. మర్నాడు ఆమె మా ఇంటికి వచ్చింది. 'ఆవకాయ' రుచి ఎట్లా వుందని మేమడిగితే 'ఆ...ఫరవా లేదులే! కొంచెం ఘాటు తగ్గినట్లుంది. అయినా మాకాలంలో నేను ఏ వూరగాయ వేసినాసరే ఆరునెలలయినా రుచి చెడకుండా 'ఘుమ' 'ఘుమ' లాడుతూ వుండేది. ఇప్పటి వాళ్ళకా రుచి కుదుర్తుందా? నేను చూస్తున్నాగా. మర్నాటినుంచీ పాతవాసన కొడ్తుంటుంది. అన్నది చేతులు, మూతి తిప్పుతూ.

ఆవిడ కుచ్చితపు స్వభావానికి అందరికీ వళ్ళు మండిపోయి క్రమంగా ఆవిడ అంటే ఒకవిధమైన నిరసనభావం మా అందరిలోనూ ఏర్పడింది.

ఈవిధమైన వాళ్ళు తాము చేసేపనులే ఘనమైనవనీ, ఇతరుల పనుల్ని చులకన చేద్దామని ప్రయత్నిస్తారు. అందరూ తమ దగ్గరికే సలహాలకు వచ్చి తమని పొగడాలని ఆశిస్తారు. తీరా అలా జరక్కపోయేసరికి ఎదటివారితో చెప్పి సాధిస్తారు. మొదట్లో వీళ్ళను ఇతర్లు లక్ష్యంచేసినా, క్రమంగా అలక్ష్యభావం ప్రత్యక్షంగా కాకపోయినా, పరోక్షంగా యేర్పడుతుంది.

'ఏమీలేని విస్తరి ఎగిరెగిరి పడ్తుందన్న' సామెత ప్రకారంగా మంచివాళ్ళెప్పుడు తొణకరు. అవసర సమయాల్లో ఆదుకుంటారు. మాట సహాయం చేస్తారు. ఈ సహాయబుద్ధి లేనివాళ్ళే పరోక్షంగా విరోధాన్ని పొందటానికి వాంఛిస్తారు.

అసలు వెనకటికంటే ఇప్పుడు ఇటువంటి 'చేతకాని సలహాల' వాళ్ళ సంఖ్య చాలా వరకు తగ్గిపోయింది. పట్టణాలలో ఇటువంటి బాధ ఎక్కువగా కనిపించదు. ఇక ఎటొచ్చీ, గ్రామాల్లోనే నాడూ, నేడూ కూడా ఈ దురలవాటు ఎదురవుతూ వుంటుంది. దానికి కారణం తీరిక ఎక్కువ కావటం అనుకుంటాను.

ఈవిధమైన అలవాటు పోగొట్టుకోవాలంటే ఏదో ఒకపని చేస్తూండాలి. అనవసరంగా ఇంకొకళ్ళ విషయాల్లో జోక్యం కల్గించుకోకుండా వుండాలి. అంతగా పనిపాట లేనివాళ్ళు ఏ పుస్తక పఠనమో చెయ్యాలి. అదికాపోతే 'హరిస్మరణ' చేస్తేసరి. ఇట్లా జరిగినరోజే ఏ సమస్య అయినా దానంతట అదే మాయమవుతూ వుంటుంది.

పూర్వం నారదమహర్షి 'కలహప్రియుడు'గా అవతరించాడంటే లోక కల్యాణార్థం! మరి ఈ 'కలహప్రియుల' సంగతో? ★

---

## సగ్గుబియ్యము పెరుగువడ

### కావలసిన సామానులు

ఒకకప్పు సగ్గుబియ్యము, ఒకటిన్నరకప్పు తియ్యనిపెరుగు, సరిపడ ఉప్పు, పావుపావు నెయ్యి.

చేయువిధము:—సగ్గుబియ్యము రాయి రప్పా లేకుండా శుభ్రంగా చేసుకొని పెరుగులో రెండుగంటలు నానపెట్టాలి. రోలు శుభ్రంగా కడిగి తడిలేకుండా తుడిచి సరిపడ ఉప్పు వేసి నానపోసిన సగ్గుబియ్యము మెత్తగా రుబ్బుకొని నెయ్యిపోసి కళాయి పొయ్యిమీద పెట్టి నెయ్యిమరుగుతుండేప్పుడు అరటి ఆకుముక్క తీసుకొని నిమ్మకాయంత ముద్దతీసికొని ఆకుమీద పెట్టి పల్చగా ఒత్తి, నెయ్యిలో వేసి ఎర్రగా వేగిన తరువాత తీయవలెను. ఇవి వేడిమీద తిన్న ఘుమఘుమ, లాడుతూ చాలా రుచిగా ఉంటవి. కారం కావాలనుకునే వాళ్ళు వాళ్ళిష్టమైన ఏ పచ్చడితోనయినా తినవచ్చు.

ఎస్. ఎల్. పి. కనకరత్నము

---

# వి(ఘ్న)నాయకుడు

(32-వ పేజీ తరువాయి)

పొందవలసినదేనా! అలాగైతే దేవలోకాలే తల్లడిల్లిపోవా! ... చంద్రుని తప్పు మన్నించి శాపం ఉపసంహరించుకో దేవీ!" అంటూ ప్రార్థించారు.

అంతమంది పెద్దలు ప్రార్థించిన తరువాత ధైర్యాన్ని చిక్కబట్టుకొని అవునన్నట్టు దేవివైపు క్రీగంట ప్రాధేయపూర్వకంగా చూశాడు భోలానాథుడు.

'సరే! మీ కోర్కె మన్నిస్తాను!' అన్నట్టు చిరునవ్వు విసిరి బొజ్జయ్యను తొడమీద కూర్చుండబెట్టుకొని బొజ్జ నిమురుతూ "శాపాన్ని పూర్తిగా ఉపసంహరించుకోవడం నాకిష్టంలేదు. కాని ఏనాడైతే మా చిట్టి తండ్రి విఘ్నాధిపతి అయ్యాడో ఆనాడు (అనగా భాద్రపద శుద్ధచతుర్థి) వినాయకుని తమ విభవముకొలది పూజించిన వారు చంద్రుని చూచిననూ దోషములేదు. వారి కెట్టి నీలాపనిందలూ రావు!" అంటూ తన శాపానికి మార్గాంతరము తెలిపింది ఆదిశక్తి.

చివరకు ఆదిశక్తికి కూడ స్వార్థమే! తన కుమారుని గొప్పతనం నాలుగు కాలాల పాటు నిలిచివుండాలని ఆమె అభిలాష!... ఎలాగైతే నేమిటి? విఘ్నాధిపతి దేవతలలో గొప్పవాడై కూర్చున్నాడు! ... ఏతల్లి తన కుమారుని ఉన్నతిని ఆశించదు?—

లోకేశ్వరి తన్మయత్వంలో అనుకోని పరిస్థితులలో సృష్టించబడ్డాడు వినాయకుడు. ఆదిశక్తికి అల్లారు ముద్దుబిడ్డడు వినాయకుడు. విఘ్నముల కన్నిటికీ అధిపతి వినాయకుడు. అతనిని పూజింపక చంద్రుని చూస్తే తప్పక నీలాప నిందలు నెత్తిన పడతాయి. నీలాప నిందలవల్ల గౌరవహానీ... దానివల్ల ఆత్మహత్యవరకూ మనసు పోవటం—

వీటన్నిటి కారణంగా వినాయకుడు భారతీయులకు పూజనీయుడయాడు. రాజులేమిటి.. మహారాజులేమిటి ... కొమ్ములు తిరిగిన మహావిష్ణువు వరకూ అందరూ ఆనాడు విఘ్నాధిపతిని పూజిస్తారు. తప్పదు!...హిందువుల కున్న యిన్ని పండుగల్లో ఏది చేయకపోయినా వచ్చిన యిబ్బంది ఏమీ లేదు కాని...విఘ్నేశ్వరుని భాద్రపద శుద్ధ చతుర్థినాడు పూజించనివారికి మటుకు చాలా అనర్థాలు ఒనగూడుతాయి! అది మటుకు నిజం!— కాబట్టి మనం భాద్రపద శుద్ధ చతుర్థినాడు విభవంకొద్దీ వినాయకుని పూజించి తరిద్దాం! ★




# ★ కుటుంబ కలహం ★

వర్ణింప తరముగాదండీ!-గొప్ప
వాడైన యాశివుని -
ఘోర గృహకలహంబు॥ వ॥

ముల్లోకముల నేలు -
ముక్కంటి దొరయింటి
కల్లోల మది మహో -
కవులకైననుగాని॥ వ॥

గణపయ్య వాహనము -
గనినంత నోరూరి
మ్రింగ జూచెడి అతని -
మెడలోని పాములను
వారించువారలెవరండీ!-
అయ్యారె!॥ వ॥

ఆపాములను జీల్చ -
అవకాశ మెప్పుడని
కార్తికేయుని నెమలి -
కాచుకొని యుండునట॥ వ॥

గణనాయకుని మోము -
గని యేనుగని యెంచి
పార్వతమ్మను మోయు -
బలమైన సింహంబు
పెనుబొబ్బలిడ బూనునంటా! -
అబ్బబ్బ!॥ వ॥

పార్వతమ్మనుజూడ -
పడదంట గంగకును
గంగమ్మ యనగానె -
కాదంట పార్వతికి॥ వ॥

కలకాల మీపోరు -
గాంచజాలక వడిగ
కడతేరగాదలచి -
కైలాసనాథుండు
కాలకూటము మ్రింగినాడూ!
అహ్హాహ్హా॥ వ॥

["అత్తుం వాంఛతి"అను శ్లోకం ఆధారంగా]

సముద్రాల లక్ష్మయ్య

# దొంగ యుక్తి

ఒక రాజుగారి రాజ్యంలో నలుగురు ఆరితేరిన దొంగలుండేవారుట. అరవై నాలుగు కళలలోనూ చోరకళలో వారిదే అందెవేసిన చెయ్యి. ఆ చోరశిఖామణులను సమీపించడానికి రాజభటుల మాటటుంచి రాజుకు కూడా ప్రాణాలుండేవి కావు. అందుచేత వాళ్ళకి పట్టపగ్గాలుండేవికావు. నిలుచున్నపడంగా నిర్భయంగా నిలువు దోపిడీ చేసేవారుట. చివరకి రాజు రాజకీయాలుకూడా మానుకుని రాత్రింబగళ్ళు వీళ్ళని పట్టుకుందుకు ఉపాయ మాలోచిస్తూ కూర్చున్నాడు హతాశుడైపోయి.

ఒకసారి వాళ్లు యిక తమర్ని ధిక్కరించి పట్టుకోగల వీరుడెవ్వరూ ఈ రాజ్యం మొత్తంమీదే లేడని స్వేచ్ఛగా దొంగతనానికి బయలుదేరివెళ్లి యిష్టం వచ్చినట్లు దోచుకున్నారు. ఆ దొంగల ఏమరిపాటు గ్రహించి సమయంకోసరం ఎదురు చూస్తూన్న రాజభటులు పెద్ద సైన్యంతో ముట్టడించి వాళ్ళని పట్టుకుని కాళ్లకి సంకెళ్లేసి రాజు ముందర నిలబెట్టారు. రాజు వీళ్ళని దయతలిస్తే లాభంలేదని వెంటనే ఉరిశిక్ష విధించేశాడు పరమ సంతోషంతో!...

రాజుగారి ఆజ్ఞప్రకారం వెంటనే ముగ్గురు ఉరితీయబడ్డారు. తర్వాత నాల్గవవాడివంతు వచ్చింది. ఆ నాల్గోవాడు వాళ్లందరిలోకీ దేవాంతకుడు నరాంతకుడూను. వాడు ఎట్లాగయినా యుక్తిపన్ని ఉరిశిక్షనుంచి విముక్తి పొందాలని నిశ్చయించుకున్నాడు. అతని కొక మంచి ఉపాయం తోచింది. వెంటనే అతను తన్ని ఉరితీయుచున్న తలారులదగ్గరకువెళ్లి—"మీరేమోముగ్గురిస్నీ ఉరితీసేశారు. ఈ నిముషంలోనే నేనుకూడా ఉరితీయబడతాను. కానీ నాకొక మంచివిద్య... రాజులకి....మహారాజులకీ కూడా పనికివచ్చే మహత్తరమైనవిద్య

**జె. వి. రత్నా...**

వొచ్చును. మీ రొకసారి నాకు రాజుగారి దర్శనమిప్పించండి. నేను రాజుగారి కావిద్య బోధించిన తర్వాత నన్ను యధాతధంగా ఉరికంబానికెక్కించుదురుగాని. లేకపోయినట్లయితేఅటువంటి రాజ్యాన్నేకాకుండా ప్రపంచాలనుకూడా జయించగల అత్యంత మహత్తరమైన విద్య నాతోటే నశించిపోతుంది. కనుక నా ప్రార్థనను రాజుగారికి విన్నవించమని ప్రార్థించాడు.

తలారివాళ్ళు రాజుగారి కీసంగతి వెంటనే తెలియజేశారు. రాజు వెంటనే ఆ దొంగని పిలిపించి అడిగాడు. దొంగ రాజుగారి ఎదుట నిలబడి చేతులు జోడించి—"మహాప్రభూ! నేను బంగారాన్ని పండించగల విద్యని ఎరుగుదును. బియ్యపుగింజలంత బంగారు విత్తనాలు చేయించి నాటిస్తే ఒక్క పదిహేనురోజులకంతా ఒక పెద్ద మహావృక్షము తయారైపోతుంది. ఆచెట్టుకి మామిడి పండ్లంత బంగారువండ్లు పండి తయారవుతాయి—మహారాజా! ఇంక నేను యింతకంటే ఎక్కువ అధికంగా చెప్పను. తమరు నేను చెప్పినట్లు చేసినట్లయితే తమరికి నా సత్యాసత్యాల సంగతి సంపూర్ణంగా తెలియగలదు!" అని అతి నమ్మకంగా కబుర్లు చెప్పాడు. దొంగ మాటలకి రాజుకి చాలా ఆశ్చర్యమేసింది. రాజు దొంగని దగ్గరకు పిలిచి—"నీమాట నమ్మవచ్చునా?" అని నిలవేసి అధికారంగా అడిగాడు. దొంగ—

"ప్రభూ! తమరు పరీక్షచేసి చూడండి. నేను నా మాటని నిలబెట్టుకుని సత్యాన్ని నిరూపించగల్గినట్లయితే నన్ను ఉరినుండి... విడుదలచెయ్యండి ... లేనిచో... అన్యథా!...!" అని చెప్పాడు.

రాజు దొంగమాటలకి దోహదమిచ్చి అతన్ని పరీక్షించడానికే ప్రయత్నించాడు. వెంటనే బంగారపు ధాన్యపు గింజలను తయారుచేయించి వోరునికిచ్చాడు. బంగారు గింజల్ని చూసి దొంగ- "మహారాజా! విత్తనాలు తయారయ్యాయి. వీటిని యధావిధిగా ఎవరిచేతనైనా నాటించండి!" అన్నాడు.

"నువ్వే వెళ్ళి నాటిరా!" అని రాజాజ్ఞాపించాడు.

"నేను అపవిత్రుణ్ణి...అయోగ్యుణ్ణి...స్వామీ! నాకు వీటిని నాటడానికి అధికారంలేదు. ఎందుకో తమకే తెలుసుననుకుంటా నన్నే నేను ముచ్చను. కనుక తమరే వీటి నెందుకు నాటి

ప్రయత్నించరాదు? ఎందుకంటే ఎవరైతే ఒక్కసారి కూడా దొంగతనం చెయ్యరో వాళ్లే ఈ విత్తనాల్ని నాటాలి!" అని విన్నవించాడు.

రాజు చాలాసేపు ఆలోచించి - "బాల్యంలో నేనుకూడా మా తండ్రి ధనాన్ని అపహరించాను. ఇప్పటివరకు ఎన్నో రాజ్యాల్ని కొల్లగొట్టాను. అందుచేత నాకు కూడా ఈ విత్తనాల్ని నాటే అధికారం లేదు" అని చెప్పాడు.

"పోనీలెండి, మీ రాజదర్బారులో ఏ ఒక్కరైనాసరే ఆ పనికి అర్హులైతే అవశ్యం ... పిలిపించండి. కనీసం రాజ్యంలో ఏ సభ్యత గల నాగరికుడైనాసరే..." ఆదేశించాడు.

సభలో కోలాహలం బయలుదేరింది. ఎవ్వరూ కూడ గుండెలమీద చెయ్యివేసికొని ఆ విత్తనాల్ని నాటడానికి ముందుకు రాలేకపోయారు. అందరూ తమ తమ నేరాల్ని నిరూపించుకున్నారు.

అది విని దొంగ విరగబడి నవ్వుతూ-"ఇక్కడి రాజు, ప్రజలు, అందరికందరూ దొంగలే అయినప్పుడు ఉరికంబాన కెక్కడానికి నేనేం అపరాధం చేశాను?" అని అడిగాడు దొంగ మాటలకందరూ ఆశ్చర్యపోయి పగలబడి నవ్వుకున్నారు. రాజుగారు కూడా ఆశ్చర్యానందంతో-"సెహబాస్! నువ్వు దొంగవైనా...దొరవే! బుద్ధిమంతుడవు. కనుక నేను నిన్ను విడిచిపెట్టేస్తున్నాను" అని చెప్పి అతనికి తన దర్బారులో ఉద్యోగమిప్పించి అతని సమయస్ఫూర్తికి ఎన్నో బహుమతులిచ్చాడు. ★

# ఎవరు సమర్థులు?

నాగేశ్వరరావు బాబ్జీ

పూర్వం ఒకవూళ్ళో రామశర్మ, కృష్ణశర్మ అనే యిరువురు బ్రాహ్మణులు వుండేవారు. ఇద్దరూ మిక్కిలి స్నేహితులు. శాస్త్రాలు బాగా అభ్యసించినవారే! కాని వారి దురదృష్టమేమొ ఎక్కడ బ్రతుకుతెరువు కానక, చివరకు భిక్షమెత్తుకుంటూ కాలక్షేపం చేయసాగారు.

ఉదయాన్నే యిద్దరూ భిక్షకై వెళ్లి వచ్చి వండుకొని తిని, నిశ్చింతగా వుండేవారు.

కాని వారికి ఒక్క విషయంలో మట్టుకు తగువు వచ్చేది!

'అంతా దైవయత్నమే! దేవుడి నిర్ణయానికి తిరుగులేదు. అతడు ఎలా చేయాలంటే అలా చేయగలడు!' అనేవాడు కృష్ణశర్మ.

దానికి అంగీకరించేవాడు కాదు రామశర్మ! 'దేవుడనేవాడే లేడు. దైవయత్న మెక్కడిది! అంతా రాజయత్నమను! మన కళ్లముందున్న రాజే గొప్పవాడు. అతను తలచుకుంటే ఏదైనా చేయగలడు" అనేవాడు.

ఇద్దరికీ యీ విషయంమీద నిత్యం గొడవ జరిగేది. అలా ఆ తగువు దిన దిన ప్రవర్థమానమై చివరకు వాళ్లిద్దరూ బద్ధశత్రువు లైనంతవరకూ పోయింది. వారు వేరే అయిపోయారు!

ఈవిధంగా రోజులు గడిచిపోయాయి. ఒకనాడు రాజవీధిలో అటునుంచి రామశర్మ యిటునుంచి కృష్ణశర్మ వస్తూ రాజమహలువద్ద కలుసుకున్నారు.

"ఏమి రామశర్మా! క్షేమమేనా! ఇంకా దేవుడులేడనే నమ్మకంలోనే వున్నావా!" అన్నాడు కృష్ణశర్మ కల్లా కపటం లేకుండా.

"ఏమిటయ్యా దేవుడంటావు! ఎక్కడున్నాడని' చూడు రోజూ కుంచానికి తక్కువగాకుండా బియ్యం విరివిగా సంభావనలూ పొందుతున్నాను. రాజమహల్లో, నన్నెంతో గౌరవిస్తారు చెప్పు ఇదంతా రాజయత్నం కాదంటావా! దేవుణ్ణి నమ్ముకున్నావుగదా నిత్యం ఏపాటి సంపాదిస్తావు. నీ పొట్టకే చాలవుగదా బియ్యం? దైవయత్నమే వున్నట్టయితే నాలాగే వుండక పోదువా!' అన్నాడు రామశర్మ కృష్ణశర్మను హేళనచేస్తూ.

దానికి కృష్ణశర్మ ఏమీ సమాధానం చెప్పలేకపోయాడు. తిన్నగా భిక్షకోసం వెళ్లిపోయాడు.

వీరి సంభాషణ మేడపైనుంచి ఆలకిస్తున్న రాజుగారు రామశర్మ 'అంతా రాజయత్నం' అని తనను మెచ్చుకున్నందుకు ఉప్పొంగిపోయి, అతని కేమైనా బహుమతి యిచ్చి అతని పేదరికాన్ని పోగొట్టాలని అనుకున్నాడు. వెంటనే భటుని చేత రామశర్మను అంతఃపురానికి పిలిపించాడు. ఓ హో ఏమిఅదృష్టం! రాజాగారు పిలిచారంటే మాటలా!' అనుకున్నాడు రామశర్మ.

రాజుగారు ఒక పెద్ద గుమ్మడికాయ తెప్పించి, దాన్ని లోన గుల్ల చేయించి అందులో రత్నాలు, బంగారపుకాసులు, విలువైన ఆభరణాలు పెట్టించి, మళ్లా ఎప్పటిమాదిరి పైన మూతపెట్టేసి, రామశర్మకు బహుమానంగా యిచ్చాడు.

రామశర్మ యింటికి గుమ్మడికాయను తీసుకువెళ్లి కోసి చూసి, అందులోని సంపదను చూసి ఒక్కసారే ఆశ్చర్యపోయి తనని యింకా గొప్పగా మెచ్చుకుంటాడని రాజు అలా చేశాడు.

"ఏమిటో మణులో, మాన్యాలో యిస్తాడనుకుంటే యింత బరువుగల గుమ్మడికాయ నెత్తిన బెట్టాడు! ఇదెవడికి క్కావాలి! ఛీ పాడు!" అనుకొని రామశర్మ దాన్ని తీసుకువెళ్లి ఒక కోమటిశెట్టి కొట్లో యిచ్చేసి, వంటకు కావలసిన సరుకులు పట్టుకు చక్కాపోయాడు.

భిక్షమెత్తుకోవడం పూర్తిచేసి కృష్ణశర్మ ఇంటిముఖంపట్టాడు. ఆరోజు కృష్ణశర్మకు బియ్యం ఎక్కువగానే దొరికాయి. అతను ఆరోజు తిన్నా, యింకా మూడు రోజులకు సరిపడే బియ్యం మిగులుతాయి.

కాని కృష్ణశర్మకు యిల్లంటూ

లేదు ఎప్పటిదప్పుడే స్వాహా చేసేస్తాడు అందువల్ల మిగిలిన బియ్యము శెట్టికొట్లో యిచ్చేసి యేమైనా వెచ్చాలు తీసుకుపోవచ్చునని వచ్చాడు అక్కడ రామశర్మ శెట్టికిచ్చిన గుమ్మడికాయమీద కృష్ణశర్మదృష్టి పడింది

"సెట్టిగారూ! చానాళ్ళనుంచీ గుమ్మడికాయ వండుకుతిందామని భ్రాంతిగా వుంది ఈ బియ్యం తీసుకొని దాన్ని యిద్దురూ! ఊరకనే యిచ్చినట్టు సంతోషిస్తాను" అన్నాడు కృష్ణశర్మ

"అదేమన్నమాట! ఊరకనే పట్టుకెళ్ళండి! దాన్ని నేను మట్టుకు ఏంజేసుకుంటానూ! మీరు సంతోషంగా తృప్తిగా తింటే నాకు పుణ్యంరాదూ! తీసుకు వెళ్లండి!" అంటూ కావలసిన వెచ్చాలు, గుమ్మడికాయ కృష్ణశర్మకు యిచ్చాడు శెట్టి

కమ్మగా తిందామని గుమ్మడికాయ తెచ్చుకొని కోసి చూశాడు కృష్ణశర్మ ఆశ్చర్యం! దాని నిండా బంగారమూ, ఆభరణాలు చూసి కృష్ణశర్మ కళ్లు మిరిమిట్లు గొలిపాయి

"ప్రభూ! ఇన్నాళ్లకు నా మీద దయకలిగిందా! వైకుంఠవాసా!" అనుకున్నాడు కృష్ణశర్మ

కృష్ణశర్మకు అకస్మాత్తుగా అదృష్టంతిరిగిందని, ఒక్కసారే పెద్ద ధనవంతుడయిపోయాడని విని రామశర్మ భిక్షానికి వెళ్లకుండా తిన్నగా కృష్ణశర్మవద్దకు వచ్చాడు కృష్ణశర్మ అప్పుడే పెద్దమేడ కొనేసి అందులో అతి వైభవంగా వుంటున్నాడు రామశర్మను ఆదరంగా లోనికి తీసుకొని వెళ్లి కూర్చొబెట్టాడు



ఉండ్రాళ్లకోసమా? ఉండ్రాళ్ల
దేవుని వాహనం కోసమా?

—ఫోటో వసలకృష్ణకుమార్.

"రామశర్మా! ఈ అదృష్టమంతా దైవయత్న"మంటే నీవు చాలా ఆశ్చర్యపోతావు సుబ్బిశెట్టి కొట్టులో యీ గుమ్మడికాయ వుంటే కూర వండుకుందామని అడిగి తెచ్చుకున్నాను. కోసి చూస్తే అందులో అన్నీ రత్నాలూ, బంగారపు కాసులే! చెప్పు! ఇందులో రాజయత్నమేమైనా వుందా! లేక దైవయత్నమని ఒప్పుకుంటావా!" అన్నాడు కృష్ణశర్మ

రామశర్మ తన దురదృష్టానికి విచారించాడు! తేలుకుట్టిన దొంగవలె అసలు సంగతి బయటపెట్టక "నిజమే కృష్ణశర్మా! రాజయత్నం వల్ల ఏదీ ఫలించదు అంతా దైవయత్నమేనని అంగీకరిస్తున్నాను" అన్నాడు

పాత స్నేహం మరిచిపోకుండా ధనం వచ్చిందని గర్వపడక కృష్ణశర్మ రామశర్మనుకూడ తనతోటే వుండమన్నాడు యిద్దరూ ఆ ధనం అనుభవించారు!! ★

# సినిమా

'ఫిలింతీయడం జూదం ఇక్కడ డబ్బుకి విలవ లేదు' — 'ఫిలిం పరిశ్రమ ఆర్థిక పరిస్థితుల'పై పదిరోజులనాడు పెద్దల గోష్ఠి జరిపి తేల్చినది ఇదీ బొంబాయిలోని వాణిజ్య శాస్త్ర పట్టభద్రుల సంఘం ఆధ్వర్యాన ఈ గోష్ఠి జరిగింది ఫిలిం ఫెడరేషన్ అధ్యక్షుడు ఎం. బి. బిల్లిమోరియా, దర్శకనిర్మాతలు విజయభట్, బిమల్ రాయ్, నిర్మాతల సంఘాధ్యక్షుడు జె. పి. తివారీ, ఎగ్జిబిటర్ల సంఘం అధ్యక్షుడు బి. డి. బరూచా మొదలగు వారంతా పాల్గొన్నారు

"నేటి చలనచిత్ర పరిశ్రమకు ఆర్థిక పుష్టి లేదు భద్రత లేదు డబ్బు సరఫరాకు చెప్పుకోదగ్గ వసతులు లేవు" అని వీరి ప్రకటనలవల్ల విశదం అయింది

## బొంబాయి సినిమాలేఖ

"ఇందుకు కారణాలు ప్రభుత్వ వైఖరి, ప్రజాభిప్రాయం" అని బిల్లిమోరియా విమర్శించారు బలవత్తరమైన శత్రువులతో పోరాడుతున్న వీరుడితో నేటి ఫిలిం పరిశ్రమను పోల్చి, ఈ వీరుడు ఎన్ని యుద్ధాలు చేసినా ఓడిపోకుండా, ఎలాగో నెగ్గుకు వస్తున్నాడన్నారు.

"పెట్టుబడికి అప్పు తెచ్చుకోవాలి. నేడు ఇచ్చుకోవలసిన వడ్డీలు మిన్నంటుతున్నాయి అంత దారుణమైన వడ్డీకి డబ్బు తెచ్చి ఇందులో పొయ్యడం ఎంత ప్రమాదకరం అని పిస్తుందో వేరే చెప్పనక్కరలేదు ఫిలిం వ్యాపారానికి ఏ బ్యాంకూ మద్దతు ఇవ్వదు డబ్బు ఇవాళ వస్తున్నట్టు రేపూ తిరుగుతూ ఉంటుందన్న నమ్మకం లేదు వచ్చే మనుషుల కళాకళలనుబట్టి వ్యవహారం నడుస్తొంది" అని బిల్లిమోరియా వివరించారు

నిర్మాతదృష్టితో ఆర్థికపరిస్థితిని వివరిస్తూ విజయభట్ మాట్లాడారు ఈ పరిశ్రమ స్టాకు ఎక్స్ఛేంజిలాంటిదని ఆయన అభిప్రాయ పడ్డారు అమాంతం లక్షలు కురియవచ్చు, ఉత్తర క్షణాన అదంతా హరించుకు పోవచ్చు కాగా ఈ దేశంలో 'చలనచిత్ర నిర్మాత' అనిపించుకుంటున్న ఆసామికి నిజంగా ఉండాల్సిన లక్షణాలూ, సామర్థ్యం లేవు అని ఆయన అన్నారు. ఫలానావాడికి సినిమా తియ్యడం గురించి ఏం తెలుసు? ఎంత తెలుసు అన్న సొదవ అక్కరలేదు డబ్బు పుట్టించుకో గలిగితే చాలు. ఆ శక్తి ముఖ్యం అని ఆయన విమర్శించారు. పరిస్థితులు బాగుపడాలంటే, పరిశ్రమ గట్టిగా కాలు నిలదొక్కుకుని ముందుకు సాగాలంటే ఫిలిం వ్యాపారానికి కొన్ని సత్ప్రమాణాలు నిర్ణయించుకోవాలని, వివిధ శాఖల కార్యకలాపాలను బాగా సమన్వయించి నడపాలనీ, ఆపైన విదేశీ మార్కెట్లో ఎక్కువగా మన చిత్రాలకు చోటు సంపాదించ ప్రయత్నించాలనీ సూచించారు దేశంలో చలనచిత్ర ప్రదర్శనశాలలు ఎక్కువగా కట్టించడం, మంచి మంచి చిత్రాలు తీయడం, జనంకూడా మంచీ చెడ్డా తేడా తెలుసుకుని మంచి చిత్రాలను ప్రోత్సహించడం చాలా అవసరమని కూడా ఆయన చెప్పారు

ఈ పరిశ్రమకు ప్రభుత్వం ఇతోధికంగా సహాయం చేయాలని బిమల్ రాయ్ సూచించారు ఉన్న పళంగా ఈ పరిశ్రమనుచూస్తే భద్రత, స్థిరత్వం అన్నవి ఏకోశానా కనడటం లేదని ఆయన చెప్పారు నటుడు



అనుపమావారి "ఎం ఎల్ ఎ" చిత్రంలో సావిత్రి.

హాలీవుడ్ తారల పెళ్ళిళ్ళూ విడాకులూ చాలాసార్లు హేళనపాలయ్యాయి దుస్తులు మారినంత త్వరగా భర్తలు మారిపోతారన్నాడు ఒక హాలీవుడ్ ప్రముఖుడు

ఒక తార కార్యదర్శి ఆవిడ తాలూకు రికార్డులు పదిలపరచడంలో కాస్త అజాగ్రత్తగా ఉన్నందువల్ల, కాగితాలు గల్లంతయిపోయాయి ఒకసారి అవసరం వచ్చి ఆ తార పెళ్ళిళ్ళూ విడాకులూ తేరీజు వేసుకోగా, పదిసార్లు పెళ్ళాడి, పన్నెండుసార్లు విడాకులిచ్చినట్లు తేలిందట

---

దిలీప్‌కుమార్ డబ్బుజోలికి పోకుండా చలనచిత్రకళ, నటన వగైరాలగురించి పెద్దపెద్ద మాటలతో గంభీరంగా ఉపన్యసించారు

ఆపైన జె పి తివారీ (ఐ ఎం పి పి ఎ), బి డి బరూచా (సి ఇ ఎ ఐ) జె బి రూంగ్టాలు ముగురూ, ఈపరిశ్రమకు చెందిన వారందరూ సర్వదా భద్రతలేదనే భావంతో, ఎప్పుడు ఏమవుతుందో అన్న ఆందోళనతోనే అవస్థపడుతున్నారని చెప్పారు

దానాదీనా, పరిశ్రమకు ప్రతినిధులనతగ్గ ఈ పెద్దలంతా ఈ ధోరణిలో మాట్లాడి సాధించిన దేమిటి ?

దేశంలో డబ్బుగలవారందరికీ, ఈ ఫిలిం పరిశ్రమతో జోక్యంవుంటే దెబ్బతినక తప్పదన్న భావాన్ని కలిగించడమే

సాధికారంగా వీరుచెప్పిన వాదాలూ చేసిన వివరణలూ చూసిన ఏ పెట్టుబడిదారుకు ఇందులో డబ్బుపెట్ట మనసొప్పుతుంది? మరింతమంది దీనిజోలికి రావడానికి జంకి తొలగిపోతారు గదా

తమాషా ఏమిటంటే, పరిశ్రమ కష్టసుఖాలగురించి ఇంత అనర్గళంగా ఉపన్యసించిన ఈ నాయకులలో ఏ ఒక్కరూ, ఈనాడు ఇక్కడ ఉన్న లోపాలను ప్రస్తావించలేదు "స్టార్ సిస్టం" అనబడే దురాచారంగురించి మాటవరసకేనా ముచ్చటించలేదు చిత్రనిర్మాణ వ్యయం తారాపథాన్ని అందుకోవడానికి ఒక ముఖ్యకారణం పెద్ద తారలకు చెల్లించవలసివస్తున్న రుసుమే అన్న సంగతి వీరందరికీ తెలుసు అనేకవిధాల ఈ తారా(రా)ధన విధానం పరిశ్రమప్రగతికి ప్రతిబంధకం అవుతోంది ఇటీవల ఇది మరీ పెరిగింది ఇక్కడ కొందరు నటీనటులు ఈనాడు వసూలుచేసే రుసుములు హాలీవుడ్ తారలరుసుమునుమించిపోతున్నాయి మళ్ళీ, హాలీవుడ్ నటుల నియమాలూ, కట్టుదిట్టాలూ ఇక్కడ లేవు అక్కడ ఇంకా నటీనటులు ఒక్కొక్క స్టుడియోకు చెందిన కళాకారులుగానే ఉంటున్నారు ఆ స్టుడియో పేరిట వచ్చేచిత్రాలలోనే వారు ఉంటారు నిర్మాతలు చెప్పినట్టు వింటారు ఇక్కడైతే వారికి అపాటి కట్టుదిట్టాలూ లేవు నటుడికి ఇష్టం వచ్చినపుడూ, తీరికైనపుడూ నిర్మాత షూటింగ్ ఏర్పాటు చేసుకోవాలి ఒకొక్కరు అరడజను పైచిలుకు చిత్రాలలో ఉంటారు చిత్రం వచ్చినపుడు తీరికైనపుడు 'కాల్ షీట్ వరాలు' ఇస్తారు ఈ పద్ధతి దక్షిణాదిన కూడా వ్యాపించింది నిజానికి, నటులకు భారీఎత్తున రుసుములు చెల్లించి, వారి కళాకళలబట్టి అన్నీ నడపడానికి అక్కడివారే ఎక్కువ దోహదం చేశారు తమ చేతులారా అములులోకి తెచ్చిన ఈ తారా(రా)ధన విధానం చివరకి పరిశ్రమ శ్రేయస్సుకే హానికరంగా పరిణమించగలదని గుర్తించడం అవసరం ★

(ఆంధ్ర వారపత్రిక బొంబాయి విలేఖరి)

---

# గృహప్రవేశం

ప్రముఖనటుడు శ్రీ నందమూరి తారకరామారావు కోడంబాకంలో ఒక భవనం నిర్మించారు. ఆగస్టు 15 వ తేదీ ఉదయం గృహప్రవేశ మహోత్సవం జరిగింది. శ్రీ రామారావు, ఆయనతండ్రి శ్రీ లక్ష్మయ్య చౌదరి, సోదరుడు శ్రీ త్రివిక్రమరావు ఫలపుష్పాదులతో అతిథులకు స్వాగతమిచ్చారు చలనచిత్ర పరిశ్రమలోవారంతా వచ్చి, శ్రీ రామారావుకు శుభాకాంక్షలు తెలిపి, కానుకలు చదివించారు.

అనంతరం విందుజరిగింది



శ్రీ శక్తి ఫిలింస్‌వారి "హౌరా బ్రిడ్జ్"లో మధుబాల



# సినిమా వార్తలు



విజయగోపాల్ ప్రొడక్షన్స్‌వారి "గంగా గౌరీ సంవాదం" నిర్మాణం సగం వరకూ పూర్తిఅయింది. సి. హెచ్. నారాయణరావు ఇందులో శివుడి భూమిక నిర్వహిస్తున్నారు. గంగగా కృష్ణకుమారి, గౌరిగా జానకి నటిస్తున్నారు. కాంతారావు నారదుడు.

నాగయ్య, నాగభూషణం, చంద్రశేఖర్, సీతారాం, రమణారెడ్డి, వంగర, ఆర్. వి. కృష్ణారావు, పాలడుగు, సీత, సీతారామమ్మ మొదలగువారు పాల్గొంటున్నారు.

రచన పరశురాం. సంగీతం పెండ్యాల నాగేశ్వరరావు. నృత్య దర్శకుడు వెంపటి ('సువర్ణసుందరి') సత్యం, కళాదర్శకుడు తోట.

ఈ చిత్రానికి ఛాయాగ్రహణం, దర్శకత్వం వి. ఎస్. రెడ్డి నిర్వహిస్తున్నారు.

* * *

చేతనా ఫిలింస్‌వారి చిత్రం "జీవన యాత్ర" ఆగష్టులో తయారైంది. కే. ఎస్. ప్రకాశరావు దర్శకత్వాన తయారవుతున్న ఈ చిత్రంలో రమణారెడ్డి, సూర్యకళ, చదలవాడ కుటుంబరావు మొదలగువారు నటిస్తున్నారు. ప్రధానపాత్రలు నిర్వహించేవారెవరో ఇంకా తెలియరాలేదు.

ఈ చిత్రానికి మాటలూ పాటలూ అనిసెట్టి సుబ్బారావు వ్రాస్తున్నారు. సంగీత దర్శకుడు రమేష్‌నాయుడు.

* * *

నేషనల్ ఆర్ట్ థియేటర్స్‌వారి "పాండురంగ మాహాత్మ్యం" కమలాకర కామేశ్వరరావు దర్శకత్వాన తయారవుతోంది. రామారావు, అంజలీదేవి, బి. సరోజ, శివరావు మొదలగు వారు నటిస్తున్నారు. రచన సముద్రాల జూనియర్. సంగీతదర్శకుడు టి. వి. రాజు.



రజతోత్సవాలు జరుపుకున్న చిత్రం "ప్యాసా" నిర్మాత గురుదత్

* * *

నరసూవారి 'భలే అమ్మాయిలు' సెప్టెంబరు 6వ విడుదల అవుతోంది. సావిత్రి, గిరిజ, రామారావు, జగ్గయ్య, రేలంగి పాల్గొన్నారు. రచన సదాశివబ్రహ్మం. సంగీతం రాజేశ్వరరావు, దర్శకుడు వేదాంతం రాఘవయ్య.

* * *

రాఘవయ్యగారి దర్శకత్వాన తయారవుతున్న మరోచిత్రం జలరుహావారి "రాజనందిని". రామారావు, ఆర్. నాగేశ్వరరావు, జి. వరలక్ష్మి, మొదలగువారు నటిస్తున్నారు. రచయిత మల్లాదిరామకృష్ణశాస్త్రి, సంగీత దర్శకుడు టి. వి. రాజు.

* • *

ప్రభావారి 'ఆడపెత్తనం' ఆదుర్తి (తోడికోడళ్ళు) సుబ్బారావు దర్శకత్వాన రూపొందుతోంది. సగం పైచిలుకు పూర్తి అయింది. అంజలీదేవి, నాగేశ్వరరావు, రేలంగి, గుమ్మడి, రమణారెడ్డి, అమ్మాజీ, సూర్యకాంతి మొదలగువారు నటిస్తున్నారు. రచన పినిశెట్టి, శ్రీరామమూర్తి.

* * *

శ్రీ రాజరాజేశ్వరీ ఫిలిం కంపెనీవారి "కృష్ణమాయ" సగం పైచిలుకు పూర్తి అయింది. దీపావళి కానుకగా విడుదల కావచ్చుననుకుంటున్నారు. నాగేశ్వరరావు, జమున నటిస్తున్న చిత్రానికి సి. ఎస్. రావు దర్శకుడు. రచన రావూరి సత్యనారాయణ.





విజయగోపాల్ ప్రొడక్షన్స్‌వారి "గంగాగౌరీ సంవాదం'లో గంగాభవానిగా కృష్ణకుమారి

శర్వాణీవారి :



# 'అక్క - చెల్లెళ్లు'



ఏడిస్తే పడ్డవాళ్ళపళ్ళు రాల్తాయి. పొరబడితే పక్కవాళ్లవి రాల్తాయి. అయితే చెడ్డవాళ్లకిమాత్రమే పైసదుపాయం జరుగుతుందనీ, (పొర) పడ్డవాళ్లు నిక్షేపంలా ఉంటారనీ సినిమానీతి.

కథలలో సుధలలాగ చెప్పుకోతగ్గడబ్బూ, చెల్లేఅధికారాలూ ఉన్న వాళ్ళు పొరబాటున పొరబడినా ఎంతపెద్ద సినిమాకథలు సంభవిస్తాయో చెప్పలేము.

'అక్క చెల్లెళ్లు' (శర్వాణీపిక్చర్స్) చిత్రంలో సుధవల్ల పెద్దసినిమాకథే జరిగింది.

ఒకధర్మారావుగారికి బోలెడు డబ్బూ, ఇద్దరు కూతుళ్లూను. అందుకని ఆయనఆ స్తిని, రెండుతో భాగించి పంచి ఇచ్చాడు. పెద్దమ్మాయి పద్మ చాలామంచిది కాబట్టి, (క్రాస్‌వర్డ్ పజిల్సులో కాంబినేషన్ పెర్మ్యుటేషన్ సూత్రాల లెక్కప్రకారం) ఆమెభర్త సుదర్శన్ జూదరి. అతగాడు భార్య వాటాడబ్బు పట్టుకుని 'పేకాట (వి)కులతో జూదంఆడి, ఓడి,-పోయాడు. కొస్త అటూ ఇటుగా, ధర్మారావుగారి రెండోకూతురు సుధకు పెళ్లిఅయింది. ఒక మధు, ఆమె తోలుతున్న కారుకి అడ్డపడి, ఆదెబ్బకితూలి వారింటిఅల్లుడుగా పడ్డాడు. (పతివ్రత భూమికను చొక్కా తిరగేసినట్టు మార్చి, ఈపాత్రను రూపొందించారు) తక్షణం ధర్మారావుగారు కాలధర్మంచేస్తూ పెద్దకుమార్తెను, ఆమెకుమారుడు మురళినీ చిన్నల్లుడికీ, కుమార్తె సుధకీ ఒప్పగిస్తారు. పద్మ ఇమిటేషన్ బడదీదీలాగా ఇంటికి పెత్తనంవహిస్తుంది. అపుడు, సూర్యకాంతం భద్రమ్మ అనే విలన్ వేషంలోవచ్చి ఆ కుటుంబంలో కలతలురేపుతుంది. ఆస్తికి అధికారిణి అయిన సుధను 'బడదీదీ' ఖాతిరు చేయటం లేదంటూ ఆరంభించి, సుధలో అహంకారాన్ని మేల్కొలుపుతుంది. అక్కడితో ఆపిల్లకి తిక్కరేగి, తోబుట్టువును ఇల్లువెళ్లగొడుతుంది—'ఎక్కడ ఉండాల్సినవాళ్లు' అక్కడేఉండాలంటూ పద్మ అత్తింటికివెళ్లిపోతోంది. అయితే సుధభర్త, మధు తను ఉండాల్సినచోట ఉండడు. వదిన కొడుకు కోసం బెంగపెటుకొని, రోజూ పొరుగూరు వెళ్లిచూసివస్తాడు. లెక్కప్రకారం ఊరూవాడా, సూర్యకాంతం అతడికి ఎనెత్తిన అభాండాలు వేస్తారు. సుధకూడాభర్తగుణాన్ని శంకిస్తుంది. పద్మ అత్తింట ఉండలేక ఇల్లువదలిపోతుంది; కొద్దిసేపటిలో ఆమె కొడుకు సంబరంలో తప్పిపోతాడు. పద్మ, దేవుడిపాదాలమీద తలమోదుకొని ఏడ్చి మతిపోగొట్టుకుని క్యారక్టర్ యాక్షన్ చేస్తూ ఉంటుంది.

కాలంనాడు 'రాండమ్ హార్వెస్ట్'లో కన బడ్డ 'టెక్నిక్కు' దేశవాళీ తర్జుమా ఏమిటో దరిమిలా అనేక భారతీయ చిత్రాలు చూచిన



తిరగేసిన చొక్కా

ప్రేక్షకులకు గుర్తు ఉండి ఉంటుంది. తలకి దెబ్బ తగలడంవల్ల మతిపోయిన వాళ్లకి, మళ్ళీ తలమీద అలాటిదెబ్బ తగిలితేనే (గాడ్రెజ్ తాళంలాగా) స్మృతి కలుగుతుంది. చలనచిత్ర మనస్తత్వశాస్త్రవేత్తలకు ఈ వాద్యంమీద గురి ఎక్కువ అనిపిస్తుంది. ఈచిత్రంలోకూడాపద్మమళ్ళీ చిన్న కొండమీంచి తూలిపడడంవల్లనే కోలుకుంటుంది. ఈ లోగా మధుసూదనరావు నేపథ్యగీతాలకు తగిన నటనప్రదర్శిస్తూకొండలా, గుట్టలాపడి తిరగడం, సుధతన పొరపాటు తెలుసుకు తేలిగ్గా నాలిక్కరుచుకోవడం, గారడీవాడి పాలబడి, అదేగాడిలో బాగుపడి మంచిమంచి పాటలు (చాలమంచివి) నేర్చుకున్న మురళి అందంబతే తిరగడం, వెర్రిబాగులవాడుగా, నిష్ప్రయోజకుడుగా కనుపించి అందర్నీ తెగనవ్వించే ఇంద్రజాల ప్రొఫెసర్ 'హాహా', ఇంద్రజాలం చేసినట్టే, అందర్నీ ఒక చోటికి చేర్చి, అపార్థాలు సర్దివేయడం చకచక జరిగిపోతాయి. అంతా సుఖంగా ఉంటారు.

వాళ్ళకష్టాలకు కారకులైన దుర్మార్గులు భద్రమ్మనీ, పూజారి గవరయ్యనీ, గ్రూపు ఫొటోలోకిపిలవకుండా తగిన శాస్తి చేస్తారు.

* * *

ఒక విధంగా, ఈ కథా, దీన్ని ముందుకు లాగిన నాలుగు 'జోడాలా ఘోడాలూ' కొంతవరకూ అవి సాగిన దారీకూడా పాతవే అయినా, కథనడపిన దర్శకులు సార్వభౌమ అమానుల్లాలు సృజనాత్మకమైన ప్రతిభను ప్రదర్శించి, ఉన్నంతలో చెప్పుకోతగినంత గొప్పగా, తెరమీద కథను చిత్రించారు. సాధారణంగా కనపడే చాదస్తాలకు చోటివ్వకుండా, అనేక ఘట్టాలను కుప్తంగా, పదునుగా చిత్రించారు. అయితే ప్రేక్షకుల గ్రహణ శక్తిమీద, ఇంకొస్త గౌరవం ఉంచి, ఈచిత్రంలోని "తనలో తాను"లూ "తనతో తాను"లూ కొస్తంత తగ్గించిఉంటే ఇది మరింత రాణించి ఉండేదనిపిస్తుంది. కథకుకూడా కొస్త పుష్టిచేకూరేది.

అక్కచెల్లెళ్లుగా శ్రీరంజని, కృష్ణకుమారి. మధు, సుదర్శన్‌లుగా అమర్‌నాథ్, రాజనాల, ప్రొ|| హాహాగా రమణారెడ్డి, అతడి జంటగా లక్ష్మీకాంత, దుర్మార్గులుగా సూర్యకాంతం, వంగర వెంకటసుబ్బయ్య, ధర్మారావుగా పెరుమాళ్ళు, ఆయన గుమాస్తాగా సి. ఎస్. ఆర్,, మురళిగా బాల నటుడు నాగేశ్వరరావు పాత్రోచితమైన నటన ప్రదర్శించారు.

ఈ చిత్రంలో విశేషాకర్షణ పాటలూ, వాటికి పెండ్యాల నాగేశ్వరరావు కూర్చిన వరసలూను.





"నేనా? మా అక్కా?"

27 వ పేజీలో చిత్రం వేసినవారు
ఎమ్. ఆర్. నాగభూషణ్ - బెంగళూరు

అశ్వరాజ్ వారి :

# 'వినాయక చవితి'

వాలుగాలిలో పడవలా సాఫీగా తాపీగా, సాగిపోయే 'వినాయక చవితి' (అశ్వరాజ్ పిక్చర్స్) చిత్రం ఆగస్టు 22న ఆంధ్రలో విడుదలయింది. అందరికీ తెలిసినదే అయినా, అందరూ ఏటేటా చెప్పి, చెప్పించుకునే కథను, దర్శకులు సముద్రాల రాఘవాచార్య (ఇదే తొలిసారి), తెరమీద కూడా రక్తి చెడకుండా చిత్రించారు. హాస్యం పేరిట వికిలివేషాలకు ఆస్కారం ఇవ్వకుండా, కథావస్తువుకు తగ్గస్థాయిలోనే చిత్రాన్ని నడిపారు. దీనికి మాటలపాటల రచనకూడా ఆయనే చేశారు. సంగీతదర్శకుడు ఘంటసాల.

వినాయకుడు చంద్రుని శపించడం నాందిగా ఆరంభించి, శ్రీకృష్ణుడు తనపై పడిన నీలాపనిందను తొలగించుకొని, సత్యభామా, జాంబవతీయుతుడై ద్వారకకు చేరుకొన్న వృత్తాంతాన్ని సమగ్రంగా చిత్రించారు. ఇందులో మనోహరుడుగా భాసించిన కృష్ణుడు (ఎన్. టి. రామారావు) ప్రణయ ఘట్టాలలో అతి సున్నితమైన లలితమైన హాస్యాన్ని కూడా అందించాడు. కృష్ణ పాత్రకు రూపకల్పన, నిర్వహణకూడా, అటు ఠీవిని, ఇటు చిలిపితనాన్ని కూడా మేళవించి నిలుపుకొన్నాయి. సత్యభామ పాత్రనిర్వహణకూడా ప్రశంసనీయంగా ఉంది. చివరమట్టుకు, హఠాత్తుగా సత్యభామ 'నాగినీస్, బాణీలోపాడుతూ 'హాలెనీస్' డాన్సు చేయబోవడం చూస్తే మనసు చివుకుమంటుంది. సత్రాజిత్‌గా గుమ్మడి, రుక్మిణిగా కృష్ణకుమారి, ప్రసేనుడుగా రాజనాల, సత్యభామకోసం కృష్ణుడిపై పగబట్టిన శతధన్వుడుగా ఆర్. నాగేశ్వరరావు, నారదుడుగా ఆర్. ప్రకాష్. శివపార్వతులుగా జి. ఎస్. స్వామి (ఈ చిత్రానికి సహాయదర్శకుడు) సూర్యకళ, జాంబవతిగా సత్యాదేవి, వసంతకుడుగా బాలకృష్ణ నటించారు.



ఆగస్టు మొదటివారంలో మద్రాసు అన్నామలైహాలులో తెలుగు నాటకాలు ప్రదర్శించబడ్డాయి. "సతీసావిత్రి" లో యమధర్మరాజుగా వేమూరి రామయ్య.

ఈ చిత్రంలో చక్కని పాటలూ పద్యాలూ శ్లోకాలు, పద్దెనిమిది ఉన్నాయి. తద్వారా సంగీతదర్శకుడు ఘంటసాల చిక్కని తెలుగుసంగీతాన్ని వినిపించారు. ఘంటసాల మాధవపెద్ది సత్యం, రామారావు, సుశీల, లీలరాణి, సరోజిని, వైదేహి, సత్యవతి జమునారాణి, ఆయా పాటలను శ్రావ్యంగాపాడారు. సత్యభామ, చెలికత్తెల యుగళగీతి, దానికి వసుమర్తి కృష్ణమూర్తి కల్పించిన నృత్యం బాలాబాగున్నాయి. కృష్ణలీలల నృత్యాలు కూడా ఆహ్లాదకరంగా ఉన్నాయి.

ఏనాటిదైనా, ఎలాటికథైనా సినిమాలోకి ఎక్కినప్పుడు సందేశాలివ్వడానికి సందేహించనవసరం లేదు. అందుకని, ఇందులో సామ్యవాదాది నినాదాలను కూడా చొప్పించారు.

ఇవికాక ఖడ్గగదా మల్లముష్టియుద్ధాలు, రథాలమీద ఫోటోజెనిక్ తరుములాటలూ, ఆఫ్రికాలో సింహాల కొట్లాటలూ అవీ ఉన్నాయి.

పుణ్యం పురుషార్థమూనూ ... సత్కాలక్షేపం కావాలంటే నిక్షేపంగా వెళ్ళి కూర్చోవచ్చు. 



పొన్నలూరి బ్రదర్స్ వారి "శోభ"లో రామారావు, రమణారెడ్డి.

నవకేతన్ వారి :

# ★ 'నౌ దో గ్యారా' ★



కనకదుర్గా నాట్యమండలివారు ఇటీవల మద్రాసులో ప్రదర్శించిన 'కురుక్షేత్ర' నాటకంలో దుర్యోధన పాత్ర ధరించిన ధూళిపాళ సీతారామశాస్త్రి

క్రదంబాలు' ఫేమైనవన్న మామూలు విషయం హాలీవుడ్ వాళ్ళకి చిదంబరరహస్యం లాంటిది వాళ్ళు సాధారణంగా ఏదో ఓమాట ముందర అనుకుని ఆ మేరకే చిత్రాలు తీస్తారు నవరసాలూ మిళాయించడం అనే విద్య అన్ని దేశాల వారికీ ఇంకా తెలీదు బొంబాయి చిత్రాలలో సంగీతం లాగే, కథ కల్పనలో కూడా ప్రాక్పశ్చిమాల సమ్మేళనం ఇపుడు పై స్థాయిని అందుకొంది అంతర్జాతీయ స్థాయిలో సంబంధాలు అత్యంత సన్నిహితం అవుతున్నాయన్న మాట ఒకరినొకరు—ముఖ్యంగా మనము వారిని బాగా అర్థం చేసుకుని, వాటిని మన కథలో పదార్థంగా వాడుకుంటున్నాం

* * *

వారసులకూ బేవారసులకూ పదకొండు లక్షల రూపాయల ఆస్తి విషయంలో సాగిన సమరం, దేవానంద్ కొత్తచిత్రం "నౌ దో గ్యారా" (నవ్‌కేతన్ ఫిలింస్) లో కథావస్తువు ఇందులో హత్య, పరిశోధన ఉన్నాయి 'నరాలు తెగే ఉత్కంఠ వుంది అయి పుటుక్కున తెగకుండా ముందర విశ్రాంతిగా చిత్రంలో మూడింట రెండుపాళ్లు కథ బద్ధకంగా అవలించి పడుకుంటుంది అంతసేపూ దేవానంద్, కల్పనా కార్తీక్ ల యుగళగీతాలు, ఒకటి రెండు డాన్సుల లాంటివీ, వినవచ్చు—కనవచ్చు ఇష్టాయిష్టాలను బట్టి ఆనందించవచ్చు వీటికి సదుపాయంగా ఒక ఫొటోజెనిక్ వాన్ ఉంటుంది

కథారంభంలో, డబ్బులేక తిప్పలు పడుతున్న మదన్‌కు (దేవానంద్) అతని మామ మనోహర్ లాల్ ఆస్తి సంక్రమించిన వార్త చేరుతుంది ఝూంమని రైలెక్కి వెళ్ళొచ్చు, లేదా మంచికారు కొనుక్కు పోవచ్చు కాని అతగాడు గదీ అదీ సదుపాయంగా ఉన్న 'వాన్' నేపుచ్చుకు ఆడుతూపాడుతూ బయలుదేరుతాడు మావగారిఊరు పెళ్ళిపీటలమీంచి పారిపోయివచ్చిన రత్న (కల్పనా ఆనంద్) అతనితో జతగడుతుంది దారిలో

ఆపైన ఇద్దరూ దారిపొడుగునా ద్యూయెట్లు పాడుతూ వెళ్తారు ఇదివరకు నాయికానాయకులు పండు వెన్నెలలో ఇలాంటి పనులు చేసేవారు ఇందులోనూ, బహుశా ఇటుపైనా మండుటెండలో ఆసురుసురంటూ, చిడిముడిపడుతూ కూడా పాడుతారు. ఎండవేడిమికి నోరెండినా, దాహం తీర్చుకోవడం మర్చిపోయి ఇంకో యుగళగీతం అందుకుంటారు

పాటలు శచిన్ దేవ్ బర్మన్ కట్టినవి కాబట్టి, పాడినవాళ్లు రఫీ, ఆశాభోస్లేలు కాబట్టి వినడానికి హాయిగా ఆనందకరంగా ఉన్నాయి ఎదట కన్పడేవాడు దేవానంద్ కాబట్టి, హుషారుగా కూడా ఉన్నాయి కల్పన మరీ చలాకీగా నటించెయ్యకుండా ఉండిఉంటే, మరింత బాగా ఉండిఉండేది

మొత్తంమీద మూడింట రెండువంతులూ ఇలా కులాసాగా సాగిపోతుంది అనక హాలీవుడ్ మార్కు సన్నివేశాలలో కథ ఆరంభమై ఆ పంథాలోనే సాగుతుంది ఈ వారసుడి మావను హత్యచేసి ఆస్తి కాజేసి కూర్చున్న బేవారసురాలుగా లలితా పావర్



దీప్ అండ్ ప్రదీప్‌వారి పోలీసులో నాయకీ నాయకులు ప్రదీప్‌కుమార్, మధుబాల.

## "నౌ దో గ్యారా"

ఫలించింది.

చివరకు మదన్ హత్యానేరంపై పరిశోధన సాగిస్తాడు. శేవారసులకు దొరకని అసలు వీలునామాను (తన పేరిట) ఉన్నది కూడా కనుక్కుంటాడు.

చివరకు ఉత్కంఠరసప్రధానమైన ఘట్టం ఉంటుంది. దర్శకుడు విజయానంద్ ఆ ఐదు నిమిషాలూ దీని మహాకట్టుదిట్టంగా కట్టుకు వచ్చాడు. బరితెగించిన దుష్టుడుగా జీవన్ ఆ ఘట్టంలో మంచి నటన ప్రదర్శించాడు. మదన్ సాహసం చూపించాడు...

ఐదారేళ్ళనాటి హాలీవుడ్ చిత్రాలూ, అతరవాతి దేవానంద్ చిత్రాలూ చూచినా, ఖులాసా కాలక్షేపానికి ఈ చిత్రం ఫరవా లేదు.

ఈ చిత్రం గత వారం మద్రాసు ప్లాజా టాకీసులో విడుదల అయింది. ★





రామన్ ప్రొడక్షన్స్ వారి హిందీచిత్రం "ఆశా"లో వైజయంతిమాల, ఆశా.

## విక్రమార్కుడి మార్కు సింహాసనం

(12-వ పేజీ తరువాయి)

తెలుసనుకో... ఇక్కణ్ణించి వెళ్ళేదారి కావాలి."

"వెనక్కి తిరిగితే వెళ్ళొచ్చు వీధిలోకి."

రాజుకి ధోరణి లాభంలేదనిపించింది.

"అయ్యా ఎడిటర్జీ. మీరు యాంధ్రులు నేనూ ఆంధ్రుడినే. నన్ను మీరు పైకి తీసుకురావాలి. నవయువకులను పైకి తేవటం మీ బాధ్యత గదాండి. అది కుదరపోతే రామారావి లేనా, నాగేస్రావిల్లేనా ఎక్కడున్నారో చెప్పండి." అన్నాడు గబగబ

"అలాగే చెబుతాను. వాళ్లు తెలుసా"

"ఓ. మావూరు వచ్చినపుడు నా డ్రామెటిక్కు సంఘం సెక్రటీగా నేను దండ వేశానుకూడా. వాళ్ళకి బాగా తెలుసు."

"ఇంకేం భేష. అయితే స్టుడియో కెళ్లండి తిన్నగా. ఈ వేళప్పుడు అక్కడే ఉంటారు"

"సరేండి... ఈ పెట్టె, సంచీ, ఇక్కడ పెట్టి వెళ్తానండి... కాస్త దయుంచి."

పత్రిక ఎడిటర్ కి జాలేసింది. మొహం కడుక్కోమని చెప్పి, కాఫీ తెప్పించి ఇచ్చి, వెళ్లిరమ్మన్నాడు.

రాజురోడ్డున పడిపోతూ సంతోషించారు. 'ముత్తెంగాడికి ఏం తెలీదు. మరీ డబాయిస్తే అర్థణాకి చెలం'... అంతా ట్రిక్కులుగా మాట్లాడి యాక్షను చెయ్యాలి. అనుకున్నాడు.

పొగాపొగా గేటు వచ్చింది. అల్లంతదూరాన చూస్తూనే జాగ్రతపడ్డాడు రాజు. మహామహా కార్లకే దిక్కులేనట్టుంది. వరసగా ఆగిఉన్నాయి.

మహానటులు కావలసిన బోల్డుమంది, ముందస్తుగా ఈ గేటుదగ్గిర గుర్కావాడిమూలంగా 'గేటు క్రాషింగు చెయ్యలేక ఇంటికొచ్చే' శారుట. గూర్కావాడికి చాలా అధికారాలుంటాయి, ఎవడేనాసరే వాడు వద్దంటే ఆగిపోవాల్సిందే. లేపోతే లాఠీతో తోసేస్తాడు. ఇంకా మాటాతే బాకుతీసి చూపిస్తాడుట.

ఇక్కడ డబాయించి లాభం లేదు ట్రిక్కులు అంతకన్నా లాభం లేదు.

అందుకని ఓకవారనించి ఒడుపుగా కార్లు తప్పించుకుంటూ గేటుకు దగ్గరకు వెళ్ళబోయాడు. గాని ఐదారుగజాల ఇవతలే గుర్కావాడు యముడిలా నిల్చున్నాడు.

హారినీ. గేటివతల కూడానా. అనిఆశ్చర్యపడ్డాడు రాజు. తక్షణం జేబులోంచి రూపాయనోటు తీసి గుట్టుగాగుప్పిట పెట్టుకుని, వాడి దగ్గర రక్కున ఆగిపోయి "తుమ్ ఘుర్కా హై, మై ఆద్మీ హుం" అనేశాడు.

"జీహా" అన్నాడు గుర్కా కొంచెం ఆశ్చర్యంగా.

తక్షణం రూపాయతీసి వాడి గుప్పిట్లో పెట్టేసి గబగబా ముందరికెళ్ళిపోయి రక్కున ఆగి, అర్జెంటుగా వెనక్కి పరిగెట్టుకొచ్చాడు రాజు; 'హారినీ ఇది రైలు గేటు' అనుకుంటూ.

(ఇంకావుంది)

## గమనిక

ఆగస్టు, 21 వ తేది ఆంధ్రవార పత్రిక 49 వ పుటలో హాస్యనటుడు స్టాన్ లారెల్ మృతి చెందినట్లు ఉన్నది. అది సరికాదనీ లారెల్ సజీవుడై ఉన్నాడనీ గమనించ ప్రార్థన.

## న్యూఢిల్లీ లేఖ

(7-వ పేజీ తరువాయి)

కలకు రూ. 400 జీతం. లోక్ సభగాని రాజ్య సభగాని సమావేశమవుతున్న రోజులలో సమావేశానికి వచ్చిఉన్న సభ్యునికి, లేక ఏదైనా కమిటీ సమావేశానికి హాజరైన సభ్యునికి రోజు రూ. 21 భత్యం.

రైలుమీదవస్తే సభ్యుడు ఏ క్లాసులో ప్రయాణంచేసినా ఒక ఫస్టు క్లాసుటిక్కెట్టు డబ్బు, ఒక థర్డ్ క్లాసు టిక్కెట్టు డబ్బు ముట్టుతుంది. విమానంలోవస్తే ఒకటింబావతిక టిక్కెట్టు డబ్బుముట్టుతుంది. రోడ్డు మార్గాన వస్తే మైలుకు అర్థరూపాయి చొప్పున ఇస్తారు. ఇదికాక ప్రతి సభ్యుడికీ ఒక ఫ్రీ రైల్వే ప్యాస్ ఉంటుంది. దేశంలో ఎక్కడికైనా, ఎప్పుడైనా, ఏ రైల్వేలో అయినా ఫస్టు క్లాసులో అతడు ప్రయాణం చేయవచ్చు.

4. ప్రతి సభ్యుడికీ ఇంట్లో ఒక టెలిఫోను, ఏడాదికి 1800 'కాల్స్' వరకూ ఉచితంగా అనుమతిస్తారు.

పార్లమెంటు సభ్యులకు న్యూఢిల్లీలో ఫర్నిచర్ తోసహా బసలిస్తారు. 675 మంది సభ్యులకీ 82 బంగళాలు, 454 బసలు, మొత్తం 536 నివాసస్థలాలున్నాయి. ఇవి చాలవనీ, ఇంకా ఎక్కువ బసలేర్పాటు చేయాలనీ గ్రాంట్లమీద చర్చ వచ్చినప్పుడు ఒత్తిడి చేయడం జరిగింది. అయితే పార్లమెంటు సభ్యులకోసం ప్రత్యేకంగా ప్రజాధనం ఖర్చుచేసి కట్టిన ఈ బసల్లో సభ్యులు కానివారుకూడా నివసించడం కద్దు. రైల్వే ప్యాస్ లు సభ్యులకు తప్ప మరెవరికీ చెల్లనప్పుడు బసలుమాత్రం ఇతరుల కివ్వడానికి ఎలా వీలుంది.?

ప్రభుత్వం స్వాధీనం చేసుకున్న గృహాల విషయంలో కూడా ప్రభుత్వ వైఖరి అన్యాయంగా ఉంది. ఢిల్లీ రాష్ట్రం వేరే ఉండేటప్పుడు ఢిల్లీ ఆరోగ్య మంత్రికి, ఇద్దరు ఉపమంత్రులకూ ప్రభుత్వం ఇళ్ళు ఇప్పించింది. ఆ రాష్ట్రం అంతరించి చాలారోజులైనా మాజీ మంత్రులు ఇంకా ఆ ఇళ్ళల్లోనే తిష్ట వేసుకుని ఉన్నారు. రక్షణార్థులకైతే ప్రభుత్వం ఇళ్లు స్వాధీనం చేసుకోవచ్చునట. బహుశా ఈమంత్రులు రక్షణార్థులమని చెప్పుకుంటున్నారు గనుక వారు ప్రభుత్వ గృహాలలోనే ఉంటూఉండడం చట్టవిరుద్ధం కాకుండా పోయిందేమో.

ఈ మంత్రులు నిజంగా రక్షణార్థులేనా? వీరు పంజాబునుంచి వచ్చేసిన కాందిశీకులా, లేక అంతరించిన ఢిల్లీ రాష్ట్రవ్యవస్థ శిథిలాలలోంచి వచ్చేసిన కాందిశీకులా? ఈ సంగతి ఎవరన్నా గట్టిగా కనుక్కున్నారా?

ఇక పోతే రక్షణార్థులందరికీ నిష్పాక్షికంగా ఇలా ఇళ్ళు ఏర్పాటు చేస్తున్నారా? పార్లమెంటరీ వ్యవహారాలశాఖ మంత్రికి లోగడ ఆంతరంగిక కార్యదర్శినిగా ఉన్న మిస్ కమలా అరోరా అక్షరాలా రక్షణా

## న్యూఢిల్లీ లేఖ

రిసే. ఆవిడకుకూడా అప్పట్లో ఒక ఇల్లు ఏర్పాటుచేశారు. ఆతరవాత ఉద్యోగానికి రాజీనామా ఇచ్చినప్పుడు, ఆవిడ ప్రభుత్వోద్యోగిని కాదనే నెపంతో ఆమెచేత బలవంతంగా ఇల్లు ఖాళీ చేయించారు. ఇది సబబేనా?

★

> ఆంధ్రపత్రిక న్యూఢిల్లీ ప్రతినిధి శ్రీకృష్ణ జహాఙ్, అమెరికా పర్యటన ముగించి ఇటీవలే రాజధానికి తిరిగి వచ్చారు. ఇకమీద న్యూఢిల్లీ లేఖ వారంవారం పాఠకులకు అందజేస్తాం.
>
> [—సం.]

## స్వతంత్ర మలయా

(4-వ పేజీ తరువాయి)

అత్యధిక ప్రజాబలంతో శాసనసభ స్థానాలను గెలుచుకున్నది. దీనితో మలయన్ స్వాతంత్ర్య సిద్ధి తథ్యమని తేలిపోయింది. టెంకూ అబ్దుల్ రహమాన్ మలయన్లను, చైనీస్, భారతీయ ప్రజలను ఏకం చేసి వీరందరి ఐకమత్య బలంవలన ఎన్నికలలో గెలవ గలిగారు. 1955 ఆగస్టులో ఈయన మలయా ఫెడరేషనుకు ముఖ్యమంత్రి అయారు.

### వివిధజాతుల జనాభా

మలయా ఫెడరేషన్ విస్తీర్ణం 50,690 చదరపుమైళ్ళు. క్రీస్తుశకం 1 వ శతాబ్దినుంచే భారతీయ వ్యాపారస్థులు ఈ ద్వీప కల్పానికి వచ్చేవారు. కొందరు తీరప్రాంతాలలో స్థిరపడి పోయేవారు. 15 వ శతాబ్దం నుంచీ ముస్లిములు రాసాగారు. ముస్లిములు రావడానికి ముందు మలయాలో హిందూమతమే ప్రబలంగా ఉండేది. హిందూ ఆచారాలు, భాష, సంస్కృతి మలయన్లను పూర్తిగా వశపరుచుకున్నాయి. కాని ముస్లిములు వచ్చిన రెండు శతాబ్దాలలో మలయా అంతా ఇస్లామ్ మతం స్వీకరించింది.

మలయా బ్రిటిష్ ఆధిపత్యానికి లోబడి పోయిన తరవాత భారత, చైనా దేశాల ప్రజలు విశేషంగా మలయాకు లస రాసాగారు. అప్పటిదాకా నూటికి 90 వంతులున్నా మలయన్ స్వదేశీజనాభా నూటికి 54 వంతులకు దిగిపోయింది. ఇలా వలసవచ్చిన చైనీయులు, భారతీయులు మలయా ఆర్థికాభివృద్ధికి చాలా దోహదం చేశారు. కాని మతాలు, భాషలు, ఆచారాలు వేరవడంవల్ల, మలయన్ స్వదేశీయులు కేవలం వ్యవసాయ వృత్తిలోనే ఉండిపోయి పైనుంచి వచ్చిన చైనీయులు పారిశ్రామికులుగా, వర్తకులుగా వ్యవహరించడంవల్ల జాతిస్పర్థలు అధికమయ్యాయి. మలయన్ జాతీయోద్యమానికి ఈజాతి విభేదాలే ముఖ్యావరోధంగా ఉండేవి. 1955 జనాభా లెక్కల ప్రకారం మొత్తం జనసంఖ్య 60,58,317. వీరిలో మలయన్లు 29,67,233. చైనీయులు 22,86,883. భారతీయులు 7,13,810. ఇతర జాతులవారు 90,391. 1956 లెక్కల ప్రకారం మొత్తం జనసంఖ్య 62,52,000. వర్తకం, పరిశ్రమలు ఎక్కువగా చైనీయుల చేతుల్లో ఉన్నాయి. భారతీయులు ముఖ్యంగా రబ్బరుతోటల్లోను, ప్రభుత్వ కార్యాలయాలలోను, ఇతర పారిశ్రామిక సంస్థలలోనూ పనిచేస్తున్నారు. కొందరికి పెద్దపెద్ద దుకాణాలు కూడా ఉన్నాయి.

భౌగోళికంగా మలయా కీలక స్థానంలో ఉన్నది. సింగపూరు వాణిజ్య మార్గాల కూడలి. మలయా ఆర్థికాభివృద్ధికి సింగపూరు మొదలైన రేవుపట్టణాలొక ముఖ్య కారణం. మలయాలో వ్యవసాయమే ప్రధానవృత్తి. వీటిలో ముఖ్యమైనది రబ్బరు తోటల పెంపకం. తరవాత చెప్పుకోదగినది రేకుపరిశ్రమ. 11955 లో మలయా సంపాదించిన ఎగుమతి ఆదాయంలో నూటికి 85 వంతులు రబ్బరు, రేకు ఎగుమతుల మూలంగానే లభ్యమైనదంటే వీటి విలువ ఊహింపవచ్చును. వీటి ఎగుమతి సుంకాల మూలంగానే ఫెడరల్ ప్రభుత్వాదాయంలో నూటికి 29 వంతులు లభించించింది. ఇంకా ముఖ్యమైన ఎగుమతులు కొబ్బరికాయలు, పైనాపిల్స మొదలైనవి. రబ్బరుతోటలు, గనుల పరిశ్రమలు బ్రిటిషు కార్పొరేషన్ల అధ్వర్యాన ఉన్నాయి.

సుదీర్ఘమైన సంప్రదింపుల ఫలితంగా బ్రిటన్ మలయాకు స్వాతంత్ర్యం ఇచ్చివేయడానికి అంగీకరించింది. అయితే సింగపూర్ మాత్రం ఇంకా బ్రిటిషు అధీనంలోనే ఉంటుంది. సింగపూర్‌ను మలయా ఫెడరేషన్‌తో విలీనంచేయాలని సింగపూర్ ప్రజలు కోరుతున్నప్పటికీ ఇప్పటివరకూ బ్రిటిష్ ప్రభుత్వం అంగీకరించలేదు.

కొత్త రాజ్యాంగం ప్రకారం మలయా ఫెడరేషన్‌కు ప్రజలచే ఎన్నుకోబడిన నూర్గురు సభ్యుల శాసనసభ ఉంటుంది. 38 మంది సభ్యుల ఎగువసభ కూడా ఉంటుంది, గాని దీని అధికారాలు చాలా పరిమితమైనవి. నెగ్రిసెంబిలాన్ సంస్థానపు సుల్తాను "టువంకూ" అబ్దుల్ రహమాన్ ఫెడరేషన్ అధ్యక్షుడుగా ఎన్నుకోబడ్డారు. ఈఏడాది జరిగిన కామన్వెల్తు ప్రధానుల సమావేశంలో మలయాకు కామన్వెల్తు సభ్యత్వం ఇవ్వడానికి ఏకగ్రీవంగా నిశ్చయించారు. కామన్వెల్తు దేశాల సహకారంతోనూ, దేశైక్యతను సాధించగలిగిన ప్రధాన మంత్రి టెంకూ అబ్దుల్ రహమాన్ నాయకత్వంతోనూ మలయా ఆర్థికంగా, రాజకీయంగా పురోగమించి ప్రపంచ దేశాలలో సముచిత స్థానం ఆక్రమించగలదని ఆశించవచ్చును.

★




Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radha Krishna at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras-1. Editor S. Sambhu Prasad



అందిన ఫ్రానిపండ్లు

ఫోటో వనల కృష్ణకుమార్ - మద్రాసు

# పాండ్స్ వ్యానిషింగ్ క్రీమ్‌ను వాడే
# ఆమె వెంట కనపడుటకు
# అతను గర్వపడతాడు




చీస్‌బ్రో-పాండ్స్ ఇన్‌కార్పొరేటెడ్ (పరిమితమైన బాధ్యతతో యు. ఎస్. అమెరికాలో సంస్థాపితము)